92

గోర్కీ




(కథలు)



ఆదర్శగ్రంథమండలి

# పీఠాధిపతి

## (కథల సంపుటి)

మాక్సిం గోర్కీ



అనువాదం :

ఉమారాజ్

ఆదర్శ గ్రంథ మండలి,
విజయవాడ - 1.

# ఒక్క ముద్దు



"ఉప్పుకొటార్లకు పోవటం తప్పితే చేయదగ్గపని ఇంకేమీ కనిపించటంలా. ఆపని బరువైందే కావచ్చు, కాని ప్రస్తుత పరిస్థితుల్లో అంతకన్నా గత్యంతర మేముంది? ముందేంజరుగుతుందో ఎవరికెరుక? ఈలోగామాత్రం ఆకలితో మనం చస్తాం."

—అంటూ నామిత్రుడు ఎమిలియాన్‌పిలియా తన ఖాళీ పొగాకు సంచిని పదోసారిపైకెత్తిసి, అది నిన్న నెలా ఖాళీగావుందో ఇవాళకూడ అల్లే ఖాళీగా వుండన్నవిషయం నిర్ధారణచేసుకుని నిట్టూర్చి, కాండ్రించి ఉమ్మేసి, వెల్లకిలాపడుకుని యీలవేస్తూ వేడితో బొగులు బొసుకుమంటూ మేఘరహితంగావున్న ఆకాశంకేసి చూడసాగాడు. మే మిద్దరం ఒడెస్సాలో పని దొరక్క తిరుగుతూపోయి అక్కడికి మూడు మైళ్లదూరంలో స్టెప్పి నానుకునివున్న సముద్రపుటొడ్డున పడుకుని యికముం దెక్కడికి పోవాలన్న విషయాన్ని వితర్కించుకుంటున్నాం. తలను స్టెప్పి కేసి, కాళ్లను సముద్రం పైపుకు పెట్టి ఎమిలియాన్ బోర్లపడుకున్నాడు. మర్మరధ్వని చేస్తూ ఒడ్డునుతాకే సముద్రపుటలలు ఆవ్యాపనలేని అతని మురికి పాదాలను కడుగుతున్నాయి సూర్యరశ్మి బారినుంచి తన కళ్లు సగమోడ్చి, ఒకసారి పిల్లిలా ముడుచుకుంటూ, వేరొక

సారి మరింత దిగువకు - సముద్రంవేపుకు దేకుతున్నాడు. క్రిందకు దేకినప్పుడల్లా అల లాతని భుజాలనుతాకి ఒకేమారు అతనికి ఆహ్లాద విషాదాలను కలిగిస్తున్నాయి.

పూర్వపువంక దృష్టిసారించాను. ఓడలనుండి వెలువడే నల్లని పొగమేఘాలమధ్య ఓడకొయ్యలు ఊగులాడుతున్నాయి. చుక్కాని గొలుసుల గలగల ధ్వని అస్పష్టంగా వినవస్తోంది. బరువు లాగుతున్న ఇంజనులు భారంగా కూతపెడుతున్నాయి. సరుకులను పడవలకెత్తుతున్న కార్మికుల స్వరాలు వినవస్తున్నాయి. చిరిగి జీర్ణమైపోతున్న మా బట్టలకు మారుగా ఒక జత బట్టలు కొనుక్కునేందుకు కావలసిన డబ్బును సంపాదించడానికి అంత పెద్ద ఓడరేవులోనూ కాసైనా అవకాశం లేకపోయింది. లేచి ఎమిలియాన్‌తో అన్నాను:

"సరే. కొటార్లకే పోదాం పద!"

"ఏమిటి?... వెళ్లటమే!.... మరి నువ్వా బరువుపని చెయ్యగలవూ?" నావంక చూడకుండానే తాత్సారంగా ప్రశ్నించాడు.

"ఆసంగతి అక్కడే ఆలోచిద్దాంలే."

"అంటే అర్ధం, మనం వెళ్లటమేనన్నమాట?" క్రవ్వైనా కదపకుండా ఎమిలియాన్ మళ్లీ అడిగాడు.

"తప్పకుండా!"

"ఆఁ! సరే, అయితే పోదాం పద! తగలేసిన ఒడెస్సా! దీనిక్కడే నాశనమైపోనీ! పెద్ద ఓడరేవు మళ్లీ! పేరు గొప్ప. ఊరు దిబ్బ! ఏ భూకంపమో వచ్చి యెల్లాగా నేలమట్టమైపోయేదేలే యిది!"

"సరేలే, పోదాం పద; తిట్టినంతమాత్రాన మన కేమీ ఒర గదు."

"ఎక్కడికి పోదాం? కొటార్లకా? .... తీరా మనం వెళ్తే అక్కడా యిలాగే యేడుస్తుందేమో"

"మనం తప్పకుండా అక్కడికి వెళ్లితీరా లన్నావుగా మరి నువ్వు?

"అన్నమాట నిజమే ననుకో. ఇప్పుడుమాత్రం అనలే దంటున్నానా? కాని అక్కడాయేమీ లాభముండదనే నా నమ్మకం"

"ఏం, ఎందుకని?"

"ఎందుకనేమిటి? అక్కడ వా ళ్లేమన్నా మనకోసం కాచుక్కూచుని 'ఓ ఎమిలియాగారూ! ఓ మాక్సింగారూ! మీరిద్దరూ దయచేసి యీపనిలో ప్రవేశించండి; ప్రతిఫలంగా యీడబ్బుపుచ్చుకోండి .... అని స్వాగత మిస్తారనుకుంటున్నావా! కలలో కూడ అలా జరగదనుకో; తెలిసిందా? ఏమైతేనేంగాని యిప్పుడు మాత్రం మ నిద్దరికీ బోలెడంత స్వేచ్ఛ...."

"ఉపన్యాసం బాగానేవుందిగాని, పోదాం పద!

"ఒక్క నిమిష మాగు; అయిపోయింది! మనమా ఘనమైన మేనేజరుగారి దివ్యముఖానికి పోయి యేమని మనవి చేసుకోవాలో తెలుసా? నడవొంగవు. రక్త పిపాసివీ అయిన ఓ ఘనమైన అయ్యా! చూడండి, మా యీ క్షుద్రదేహాలను మీకు ఫలహారంగా అర్పించడానికి వచ్చాం—అంటే యిరవై నాలుగు గంటల రోజుకు అరవై కోపెక్కుల చొప్పున పనిచేయడానికి వచ్చాము — ఏలినవారు మాయందు పరిపూర్ణ కటాక్షముంచి

మమ్మల్ని ఫలహారంగా స్వీకరించండి స్వామీ అని చెప్పుకోవాలి. ఆతర్వాత యేం జరుగుతుందో తెలుసా?...."

"అబ్బ! సొదచాలించి లేచి నడుస్తూ. ప్రొద్దుకూకేలోగా చేపలరేవుకు పోయి. వల లాగటంలో సాయంచేస్తే జాలర్లు కాస్త తిండైనా పెట్టొచ్చు. లేద్దూ."

"భోజనమే! నిజమే. జాలర్లు మంచివాళ్లు; భోజనం పెడతారు. పద. వెళ్దాం పద .... ఏమోనబ్బా! పని దొరుకుతుందని నాకే మాత్రం నమ్మకం లేదు. పోయిన వారమంతా మనిద్దరి అదృష్టాలూ ఒకలాగే యేడిశాయి."

తడిసి ముద్దయిన వంటితో అతను లేచి నిలబడి, అన్నపు సంచుల గుడ్డతో స్వయంగా కుట్టుకున్న లాగుజేబులో చేతులు దోపి. వెతికి, వుత్తచేతులు బయటకుతీసి, వాటివంక నవ్వుతూ చూసి, ముఖం తుడుచుకున్నాడు.

"ఖాళీ!....నాలుగు రోజులబట్టి వెతుకుతున్నా—ఒక్కసారీ యేమీలేదు! బలే సంగతిసుమా!"

మేము సముద్రపువారగా నడక సాగించాం. ఒకరి వునికి మరొకరికి తెలియనట్టు మౌనంగా సాగిపోయాం. సముద్రపు గుల్లలతో కూడిన తడియిసుకలో మా పాదాలు దిగబడుతున్నాయి. ఒడ్డునుతాకే కెరటాల నీళ్లు గుల్లలపైకి వచ్చి గలగలమనే మధుర ధ్వని చేస్తున్నాయి. అప్పుడప్పుడు కెరటాలతోపాటు పీతలు, నాని నల్లబడి విచిత్రాకారాలు పొందిన కర్రముక్కలు కొట్టుకువస్తున్నాయి. ప్రాణానికి హాయిని గొలిపే చల్లని పిల్లతెమ్మెరలు మా దేహాలను తాకి, దోవలో యిసుకను సుడులుగా లేవగొడుతూ

స్టెప్పీలపైకి పరుగుతీస్తున్నాయి.

ఎప్పుడూ హుషారుగా కేరింతలుకొట్టే ఎమిలియాన్ నిబ్బరం చెడి నిరుత్సాహంగావున్న సంగతి కనిపెట్టి, అతని మనస్సును వేరే విషయాలమీదకు మరల్చాలని ప్రయత్నించాను.

"అవునుగాని ఎమిలియా! నీ జీవితంలో జరిగిన ఘట మేదైనా చెప్పరాదూ!"

"ఇప్పుడు చెప్తే యేమీ రక్తి కట్టదు తమ్ముడూ! కారణం యేమిటంటావేమో— కడుపు ఖాళీగావుంది. మనిషి దేహానికి కడుపే ముఖ్యం. ఏ అవయవంలేని మనిషైనా వుంటాడు గాని— పొట్టలేని మనిషిమాత్రం యెక్కడా వుండడు. కడుపు నిండుగా వుంటే ఆత్మ సజీవంగా వుందన్నమాటే. పొట్ట నిండిన తర్వాతనే మనిషి కార్యకలాపాలన్నీ కొనసాగుతాయి....ఆ విషయం నీకూ పూర్తిగా తెలుసు."

అతను మౌనం దాల్చాడు.

"భాయీ! యిప్పుడేగనుక సముద్రంలోంచి ఒక వెయ్యి రూబుల్సు కొట్టుకువస్తే రా— తస్సాదియ్యా! వెంటనే కల్లుదుకాణ మొకటి పెట్టేస్తాను. నాలుగు మాటలు గీకటం వచ్చినవాడివి గనుక నిన్ను గుమాస్తాగా వేసుకుంటాను. గల్లా పెట్టెక్రిందనుంచి నోటి కందేట్లు ఒక గొట్టం పెట్టించుకుని, దాన్ని తిన్నగా లోపల సారా పీపాకి తగిలిస్తాను. ఆ ఆనందోత్సాహాల సందడిలో 'మాక్సిం! మర తిప్పు!' అని ఆజ్ఞాపిస్తాను. అంతే, బుడ బుడ మంటూ తిన్నగా నోట్లోకి వచ్చేస్తుంది సారా! ఓ, ఏం మజా! దీనిదుంపతెగ, అమృతం! ఇంతలోనే నేను దోచుకుని పీల్చి పిప్పిచేసిన మురికి

రై తొకడు వస్తాడు. "ఎమిలియాన్ పావ్లిచ్! ఒక డ్రాం పారా యిద్దూ! డబ్బు తర్వా ...." "ఏమిటి?.... అరువా! ఇక్కడ అరువుబేరంలేదు!" "దయతలుచు ఎమిలియాన్ పావ్లిచ్!" "సరే, అట్లాగేలే. అయితే నాబండితోలు. ఒకగ్లాసుడు వోడ్కా యిస్తాను బండి తోలితే" అంటాను. అహ్హహ్హా! వాడిపులుసు పిండేస్తా నంతే!"

"అరే, ఎందుకోయ్ అంత కాఠిన్యం! చూడు పాపం, ఆ రైతెంత ఆకలిగా వున్నాడో!"

"ఏమిటి? ఆకలిగా వున్నాడా?.... బాగానేవుంది! సహజమే! నాకు మాత్రం ఆకలిగా లేదూ? తమ్ముడూ! వా డిప్పుడు ఆకలితో వున్నాడేమో గాని నేను పుట్టినప్పటినుంచీ ఆకలితో వున్నాను. అయినా యిదేమీ చట్టంలోలేదు. ఔను! వాడు ఆకలితో వున్నాడు. ....ఎందువేత? పంటలు పాడయ్యాయా? ఏమో నబ్బా! నాకు మాత్రం నమ్మకంలేదు. అసలు, సంగ తేమిటంటే ఆ పంట నష్ట మన్నది వాడి బుర్రలో ప్రారంభమైంది. దాంతో పొలం లోకి కూడా అది తయారైంది! తెలియ కడుగుతాగాని, మరి యితరదేశాల్లో పంట లెందుకు పాడుకాలేదు? మనవాళ్లు అటిక పిడతల్లాంటి బుర్రలు గోక్కుంటానికి తప్ప మరి దేనికీ పనికిరారు. కాని, అక్కడి వాళ్లో - వాటితో ఆలోచిస్తారు; అంతే తేడా! తమ్ముడూ! నీకు తెలుసో తెలియదోగాని, అక్కడ ఒకవేళ వర్షం ఆక్కర్లేదంటే ఆపెయ్యగలరు! ఎండ తీక్షణంగా కాస్తే సూర్యుడికి మేఘాల సద్దుపెట్టగలరు కూడాను! మరిమనం? మనం చేసే దేమిటి తమ్ముడూ?....సున్నకు సున్న. హాళ్లికి హాళ్లి! ఇప్పుడిదంతా తమాషాయే అనుకో; కాని నిజంగానే ఒక వెయ్యి

రూబుల్స్. కల్లుదుకాణం వున్నాడు యిదేనిజం....

అతను మౌనందాల్చి, అలవాటుచొప్పున పుగాకు సంచి బయటకుతీసి, ఖాళీదని గుర్తుతెచ్చుకుని, కాండ్రించి ఉమ్మేసి, కసిగా సముద్రంలోకి విసిరేశాడు.

ఆ మురికి సంచి నౌక కెరటం సముద్రంలోకి తీసికొనిపోయి, ఆ కానుకను పరీక్షించిన మీదట కోపంగా ఒడ్డుకు కొట్టివేసింది.

"అఁ తీసుకోవన్న మాట? ఎందుకు తీసుకోవో చూస్తాగా!
—అంటూ తడిసంచిని తీసుకుని ఎమిలియాన్ దాన్లో ఒకరాయిని వేసి గట్టిగా లోపలికి విసిరేశాడు.

నేను నవ్వాను.

"ఎందుకోయ్ నువ్వు? మళ్లీ మనిషి నని చెపుతావ్! పుస్తకాలు చదువుతావు. చంకనపెట్టుకు తిరుగుతావు; కాని తోటి మనిషిని అర్థం చేసుకోలేవు. నాలుగు కళ్ల జీభూతం!

ఆ భూతం అన్న విశేషణం నాపరంగా వాడబడింది. నాలుగు కళ్ల భూతం అన్నమాటతో నాపై అతని కెంత మంటగా వుందో గ్రహించగలిగాను. పరిస్థితులపట్ల, ప్రపంచంపట్ల తీవ్రమైన అసంతృప్తి, ద్వేషం, క్రోధం కలిగిన సమయాల్లోనే సాధారణంగా అతను నా కళ్లను గురించి యెగతాళి చేస్తుంటాడు. మామూలు సమయాల్లో యీ నా అత్యవసరాలంకరణ అతవి దృష్టిలో నాకు కొంత గౌరవాన్నీ, ప్రాముఖ్యతనీ కూడ కలిగించేది. అసలు మా కిద్దరికీ పరిచయమైన మొదటి రోజుల్లో తనతో పాటు బొగ్గు మోసే కూలీనే అయినప్పటికీ నా కళ్లజోడును చూపి 'ఏమండి' 'మీరు' అంటూ మన్నించేవాడు. అతని వలెనే నేనూ

చిరుగు దుస్తులు ధరించి, బొగ్గు దుమ్ము మీదపడి భూతంలా కని పించినా నన్ను మీరు అనటం మాత్రం మానేవాడు కాదు.

నవ్వినందుకు నేను క్షమార్పణ చెప్పి, అతన్ని కొంత శాంతపరుద్దామనే ఉద్దేశంతో విదేశాలను గురించి చెప్ప నారం భించాను. అతను చెప్పినట్లుగా వర్షాన్నీ, యెండనూ తమ యిష్టం వచ్చినట్లు అమపాజల్లో పెట్టగలిగిన దేశాలు కట్టుకథల్లోనేగాని నిజంగా లేవని నచ్చచెప్పటానికి ప్రయత్నించాను.

"ఏమిటి? నిజం? ఎట్లా! ఎట్లా! ఆఁ అల్లాగా!...."అంటూ అతను ఊఁ కొడుతున్నా డన్నమాటే గాని నిజాని కతనికి తన ఊహలకు వ్యతిరేకమైన ఆ దేశాలుగాని, అక్కడి ప్రజల జీవిత విధానాలుగాని అంతగా రుచించలేదనీ, అస లతను నా మాటలు చెవినిపెట్టకుండా పరధ్యాన్నంగా దూరాన యేవో చూస్తున్నాడనీ గ్రహించాను.

"అదంతా సరేగాని, తమ్ముడూ— చేతులూపుతూ అతను నామాటలకు అడ్డువచ్చాడు." "నే నొకప్రశ్న అడుగుతా, జవాబు చెప్పు. ఎవడైనా డబ్బుమూటతో దారిలోమనకు తటస్థపడ్డాడనుకో. పెద్దమూట—అతను పక్కకు చూస్తూ మళ్లీ ఒత్తిచెప్పాడు — నీ అవసరాలు తీర్చుకోటానికి.... అతణ్ణి ఖూనీ చేసేస్తావా?"

నాదేహం కంపించింది.

"చెయ్యను, ఎప్పుడూ చెయ్యను —నేను జవాబిచ్చాను —మరొకవ్యక్తి ప్రాణం తియ్యడంద్వారా యెప్పుడూ స్వసుఖ సంపాదన చెయ్యకూడదు."

"ఓ హోహో! అదంతా పుస్తకాల్లో వుండే మెట్టవేదాంతం;

అంతరాత్మకోసం చెప్పే గాలి కబుర్లు. కాని, యీ మాట మొట్ట మొదటిసారిగా ఊహించిన పెద్దమనిషి వున్నాడే, అతనే కనుక అవస్థల్లో వుండివుంటే—తప్పకుండా మంచి అవకాశం దొరికి నప్పుడు స్వప్రయోజనంకోసం పరునిప్రాణం చేతులారా తియ్యడాని కెంతమాత్రం జంకేవాడుకాదు. నేను చెప్పింది యదార్థం!— అక్షరాలా నిజం! బిగించబడిన ఎమిలియాన్ పిడికిలి నా కళ్ల ముందు నాట్యంచేసింది. ఏదో ఒకరకంగా ప్రతిమనిషీ యీ పని చేస్తూనేవుంటాడు. అందులో తప్పేమీ లేదుకూడా!... "

ఎమిలియాన్ కనుబొమలు ముడిపడ్డాయి. నిడుపాటి కనుబొమలు అతని కళ్లను మరుగుపరిచాయి.

అతను కోపంగా వున్నప్పుడు మరి అడ్డుచెప్పి లాభం లేదన్న విషయం నాకు బాగా అనుభవమే. అందుకని మాట్లాడక ఊరుకున్నాను.

కాళ్లకు తగిలిన కర్రముక్క నౌకవాన్ని సముద్రంలోకి యీడ్చితన్ని నిట్టూరుస్తూ అన్నాడు.

"ఇప్పుడు పుగాకు వుంటే యెంత బాగుండును...."

మా కుడిప్రక్క స్టెప్పీమీద యిద్దరు గొర్లకాపరులు మా వంకే చూస్తూ పడుకునివుండటం నా కంటపడింది.

"నమస్కారం! -"ఎమిలియాన్ బిగ్గరగా పలకరించాడు.

"మీ దగ్గర పుగా కేమైనా వుందా?"

ఒక పశులకాపరి రెండోవాడివంక తిరిగి తా నంతవరకు కొరుకుతూన్న గడ్డిపరక నుమ్మేసి తాత్సారంగా అడిగాడు.

"పుగాకు కావా లనేనా వా ళ్లంటున్నారు మెకేల్?"

మాతో మాట్లాడటానికి అనుమతిని కోరుతున్నట్లుగా ఒక్కక్షణం ఆకాశం వంక చూసి మైకేల్ మావంక తిరిగాడు.

"నమస్కారం!" అన్నా డతను.

"అయితే యెక్కడికి పోతున్నా రేమిటి?"

"అఫనోవ్ ఉప్పు కొటార్లకు పోతున్నాం"

"ఏమిటి! మిమ్మల్ని రమ్మని వాళ్లు పిలిచారా?"

"వాళ్ల పక్కనే బైరాయిస్తూ మేము మౌనం దాల్చాం"

"సరీనా! చేసాంతు లొచ్చారు కూటికుండ జాగ్రత్త!"

సరిగా టక్కరి న వ్వొకటి నవ్వి రొమ్ము సంచి భద్రం చేశాడు. ఎమిలియాన్ పళ్లు నూరాడు.

"అయితే మీకు పుగాకు కావాలన్నమాట?"

"మేము చాలా నేస్తైంచిలే పొగ తాగి" వాళ్లు మాకిచ్చిన ఆహ్వానానికి సంగారుపడి అన్యాపదేశంగా చెప్పాను.

"అల్లాగా? అయితే కాల్చండి!"

"ఏమ్, ఉక్రేనియన్ దెయ్యాలూ! నోరు ముయ్యండి! ఇవ్వాలనివుంటే యివ్వండి; అంతేగాని నవ్వబోకండి!.... కొడుకు లారా! చేరపోతే స్టెప్పీల్లో తిరిగి తిరిగి హృదయాలు కోల్పో యారా? నాలుగు తంతే పోయి మీ బాబుల్తో చెప్పుకుంటారు మళ్లీ!"

ఎమిలియాన్ గ్రుడ్లు తిప్పుతూ ఉరిమాడు.

పశులకాప ర్లిద్దరూ ఒక్క దుముకున లేచి బాణా కర్రలు చేపట్టి ఒకరి సరస నొకరు నిలబడ్డారు.

"ఏం, బాయీ! మీ అడగటంపద్ధతి యిదేనా! అయితే, చూస్తారేం రండి!.... ఊ(!"

ఉక్రెనియన్ దెయ్యాలు దెబ్బలాటకు సిద్ధంగా వున్నారనటంలో యిసుమంతైనా సందేహం లేదు. ఎమిలియాన్ కూడ వెనుకతియ్యబోడని అతని బిగించిన పిడికిలి, నిప్పులు చెరుగుతున్న కండ్లు చెప్పక చెప్పతున్నాయి. నాకు మట్టుకు కుస్తీలో పాల్గొనే ఓపికా లేదు, పాల్గోవాలనే కుతూహలమూ లేదు. అంచేత యిరు పక్షాలనూ శాంతపరిచే ప్రయత్నాలు చేశాను.

"శాంతించం డయ్యా! మా స్నేహితు డేదో తొందరపడి తిట్టాడే అనుకోండి; కాని యింతలోనే మహా మునుచుకు పోయేదేమీ లేదు కదా! కాని చూడండి, మీకేమీ అభ్యంతరం లేకపోతే కాస్త పుగాకు యివ్వండి; మా దారిన మేం పోతాం."

మైకేల్ నికిటా వంక, నికిటా మైకేల్ వంక చూసుకుని యిద్దరూ నవ్వారు.

"ఆ సంగ తేదో ముందే చెప్పకూడదూ!"

మైకేల్ తన జేబులో చెయ్యి పెట్టి లావుగావున్న పుగాకు సంచిని తీసి నా వంక జాపాడు.

"ఇదుగో పుగాకు. తీసుకో!"

నికిటా తన భోజనపు సంచిలో చెయ్యిపెట్టి దండిగా ఉప్పు చల్లిన ఒక పెద్దరొట్టె, కొంత కొవ్వు యిచ్చాడు. మైకేల్ మరి కాస్త పుగాకు తీసుకోమని బలవంతం చేశాడు. నికిటా 'సెలవు' అని గొణిగాడు, నేను కృతజ్ఞత తెలిపాను.

ఎమిలియాన్ చిరచిరలాడుతూ నేలమీద చతికిలబడి బిగ్గరగానే గొణిగాడు: "పందివెధవలు!"

ఉక్రేనియను లిద్దరూ తిరిగి తిరిగి మా వంక చూస్తూ పెద్ద

పెద్ద అంగ లేసుకుంటూ స్టెప్పీలోకి పోయారు. మేము నేలమీద చతికిలబడి ఉక్రేనియనుల చూడటం మాని మంచి రుచిగావున్న రొట్టెను కొవ్వునంజుకొని తిననారంభించాం. ఎమిలియాన్ నా కళ్లవంక చూడకుండా ఆదరా బాదరా కొరికి. రొప్పుతూ తొందర తొందరగా తినసాగాడు.

సాయంత్రమైంది. సంజ చీకట్లు దూరాన సముద్రం మీదుగా ప్రారంభమై డోలలూగు సముద్ర జలాలకు లేత నీలపు ముసుగు వేశాయి. దూరాన సముద్రంలోనుండి ఎరుపు - పసుపు రంగుల మిశ్రమ వర్ణపు మేఘాలు బయల్దేరి ఆకాశం పైపైకి ప్రసరించి నీలిటిని గాఢతరం చేశాయి. స్టెప్పీ చివర ఆకాశపుటంచుల్లో అస్తమిస్తున్న సూర్యుడు ప్రసరించే కెంజాయాలు ఎర్రని పెద్ద విసనకర్రవలె అలుముకొని భూమ్యాకాశాలకు సున్నితమైన మలామా వేస్తున్నాయి. సముద్ర కెరటాలు పొంగి ఒడ్డును తాకు తున్నాయి. సంధ్యారుణకాంతులు ప్రసరించటంమూలాన సముద్రం ఎరుపు. నీలరాగ రంజితమై బహుసుందరంగా కన్పట్టుతోంది.

"పుగాకు లియ్యి! ఉక్రేనియన్లు దూరంగా తగులడ్డారులే!" వాళ్ల పీడ ఒదిలినందుకు ఎమిలియాన్ బహు సంతోషించినట్టుగా చెప్పించాడు. "ఏం. యింకా ముందుకు పోదామా. యీ రాత్రికి యిక్కడే మకాం వేద్దామా?"

"ఇంకా ముందుకు వెళ్లడం నాకు సుతరామూ యిష్టంలేదు. ఈరాత్రి యిక్కడే గడుపుదాం!" అని నిర్ణయించాను.

"సరే. యిక్కడే గడుపుదాం!" ఎమిలియాన్ ఆకాశంవంక చూస్తూ వెల్లికిలా పడుకున్నాడు.

నిశ్శబ్దం తాండవిస్తోంది. ఎమిలియాన్ చుట్ట కాలుస్తూ ఉమ్మి లేస్తున్నాడు. నేను చుట్టూ చూసి సంజశోభను తిలకించి అబ్బురపడుతున్నాను. స్టెప్పీమీదుగా సముద్రకెరటాల ఘోష లయగా వినపస్తోంది.

''డబ్బున్న మనిషి తల పగలగొట్టడం—ఏమంటావ్ — ముఖ్యంగా అల్లా పగులగొట్టి పట్టుబడకుండా తప్పించుకోగలిగిన నాడు బాగానే వుంటుంది''అంటూ ఎమిలియాన్ అకస్మాత్తుగా ప్రారంభించాడు.

"ఆ అర్థంలేని గొడవ యిక చాలించు'' నేను కోపంగా మందలించాను.

''అర్థంలేని పనా? దాంట్లో అర్థంలేని విషయ మేముంది? నువ్వు చూస్తూవుండు, యీ పని నే నెప్పుడో ఒకప్పుడు తప్పకుండా చేసేతీరుతాను! నావయస్సిప్పుడు నలభై యేడు సంవత్సరాలు. ఇప్పటికి యిరవై యేళ్లనుంచి యీ విషయం ఆలోచిస్తున్నాను. నాదీ ఒక బ్రతుకే! కుక్కబ్రతుకు. తినటానికి మెతుకుల్లేవు; తల దాచుకోటానికి గుడిసె లేదు. కుక్కబ్రతుకుకన్న హీనం. నేనూ ఒక మనిషినే? నమ్మెదూ! మనిషిని కాదు, కీటకాన్ని, అడవి జంతువుని! న న్నెవరు అర్థం చేసుకోగలరు? ఎవ్వరూ చేసుకోలేరు. ప్రపంచంలో సుఖంగా బ్రతికే మనుషు లున్నారు కదా, వాళ్లలా నేను మాత్ర మెందుకు సుఖంగా బ్రతకకూడదు? హుం, వాళ్లని తగలెయ్య!'' అకస్మాత్తుగా నావేపు తిరిగి అత నన్నాడు!

''ఒకసారి నేను అంతపనీ....అది కొద్దిలో చెడిపోయింది. అబద్ధమాడితే నేను చచ్చినంత ఒట్టు....ఇంతకీ శనికొట్టు పీనుగుని.

నా దురదృష్టం. చెప్పమన్నావా?"

నేను వెంటనే అంగీకారం తెలిపాను. ఎమిలియాన్ చుట్ట కాలుస్తూ చెప్పనారంభించాడు.

"తమ్ముడూ! నేను చెప్పబోయే సంగతి పోల్టావాలో ఎనిమిదేళ్ల క్రితం జరిగింది. అప్పుడు నే నొక కలపవర్తకుని వద్ద పని చేస్తూ వుండేవాడిని. ఒక యేడాదిపాటు అంతా సజావు గానే జరిగిపోయింది. అంతలో నేను త్రాగుడుకు అలవాటుపడి, చెప్పకుండా మా యజమాని సొమ్ములో అరవై రూబుల్సు వరకు త్రాగుడుకు ఖర్చుచేసేశాను. వాళ్లీసంగతి తెలుసుకోగానే నామీద కేసు పెట్టి, మూడునెలల కఠినశిక్ష వేయించి జైలుకు పంపారు. నీకూ తెలుసుగా అక్కడ మక్కెలు విరకొట్టే సంగతి. అవన్నీ పూర్త య్యాయి. నా శిక్ష అనుభవించి తిరిగి వచ్చాను. అప్పు డిక యెక్కడికి పోవాలి? ఆ పట్నంలో అన్నీ యెరిగున్న ముఖాలే. పోనీ మరొక పట్నానికి పోదామంటే దుస్తులూ లేవు, దారి బత్తెమూ లేదు. అప్పుడు నే నెరిగున్న ఒక కల్లుదుకాణపు యజ మాని దగ్గరకు బయల్దేరాను. అతను దొంగలకు రక్షణ యిస్తూ, దొంగసొమ్ముతో బేరం చేస్తూ వుంటాడు. అతనిది మహా మంచి హృదయం. అంతేకాదు, చాలా నమ్మకస్తుడు. బలే తెలివైన వాడు. అత డెన్నో పుస్తకాలు చదివి జీవితాన్ని సాకల్యంగా అర్థం చేసుకున్నవాడు. అంచేత నేను అతని దగ్గరకు వెళ్లి "పాల్ పెట్రోవ్! నాకు కొంచెం సహాయంచేద్దూ!" అని అడిగాను "సరే, సరే! తప్పకుండా" అన్నా డతను. ఒకేరకం భావాలుకల మను షులు పరస్పరం సహాయం చేసుకోకపోతే యెల్లా? తిను, త్రాగు,

బ్రతుకు, చుట్టూ జాగ్రత్తగా పరీక్షించి చూడు. తమ్ముడూ! ఆ పాల్ పెట్రోవ్ వున్నాడే, బలే తెలివైనవాడు. అతనంటే నాకెంతో గౌరవం. అతనికూడా నేనంటే చాలా ప్రీతి. గల్లాపెట్టె ముందు కూర్చుని ఫ్రెంచి గజదొంగల్ని గూర్చిన పుస్తకాలు అదేపనిగా చదివేవాడు. అతని పుస్తకాలన్నీ దొంగల్ని గురించినవే. విటూండగానే....వాళ్లు తలుపు బ్రద్దలుకొట్టి లోపలకు దూరేవారు. బలే, బలే! కాని, చివరికి మాత్రం, కోర్టులో ఉరిశిక్ష! దానితో కృషి అంతా బూడిదలో పోసిన పన్నీరై పోవడమూను."

"ఆ పాల్ పెట్రోవు దగ్గర రెండు నెలలు గడిపాను. అతని పుస్తకాల్లోని విషయాలు, సంభాషణలు అన్నీ వొంట బట్టించుకున్నాను. దొంగలు చిన్న చిన్న వస్తువులు --- గడియారాలు, గాజులు వగైరా తీసుకురావటం గమనించాను. వాళ్లు చేసేపని నాకేమీ నచ్చలా. కుడిచేది తురకకూడైనా కడుపు నిండాలని నిశ్చయించుకున్నాను. వా ళ్లేదో చేదెబ్బకొట్టి తీసుకురావటం — వాటికి పాల్ పెట్రోవ్ సగం ఖరీదు లివ్వడం— అతను మాత్రం తమ్ముడూ! సొమ్ము నమ్మకంగా వెంటనే యిచ్చేసేవాడు! తర్వాత చూసుకో!... ఒక విందా, ఒక నాట్యమా పెద్ద గొడవే అనుకో— అతని సంపాదనంతా ఆదెబ్బతో పైసలా! ఏం గొప్పపని లేద్దూ! ఏం లాభం! రెండుసార్లు దాటిపోయినా మూడోసారి దొరికి పోవటమేగా!....

"ఇంతాచేసి యేంపెద్దకారణ ముందని? దొంగతనం చేశాడనే అనుమానం మీదో లేక యే నూరు రూబుల్స దొంగిలించాడనో!—వెధవ వందరూబుల్సు! అయితే మానవ జీవితం

విలువ నూరు రూబుల్సా? మూర్ఖులు! సరే, పాల్ పెట్రోవ్‌తో చెప్పానుకదా-

"పాల్‌పెట్రోవ్: నిజం చెప్పాలిసొస్తే నువ్వుచేసే యీపని నాకేమీ నచ్చలా. కాస్తదానికీ కూస్తదానికీ కక్కుర్తిపడితే యేం లాభం? తినేది తురకకూడైనా కడుపునిండాలి." అని.

"హుఁ! ఏమో, ఆసంగతి నేనేం చెప్పను" అన్నాడతను. ఒక ప్రక్క ఆకలి, మరొకప్రక్క ఆత్మగౌరవం లేకపోవడం- చూడు, యెల్లాంటి దుస్థితో! తనవిలువ తాను తెలుసుకున్న వా డెవడైనా ముష్టి యిరవై రూబుల్సు కొంగజనానికి పాల్పడ తాడా? ఎన్నడూ అలా చేయడని ఢంకా బజాయించి చెప్పగలను! చూడు, నేనే వున్నాను, యూరపియన్ నాగరికతతో సన్నిహిత సంబంధం కల్పించుకున్నవాడు నేను వెధవ వంద రూబుల్సు సొమ్ముకు కక్కుర్తి పడతా నంటావా?—తర్వాత, తనను తాను పూర్తిగా అర్థం చేసుకున్నవ్యక్తి యేవిధంగా ప్రవర్తించాలో నా కతను ఉదాహరణ పూర్వకంగా బోధించాడు. ఆవిధంగా మే మిద్దరం చాలా సేపు కబుర్లు చెప్పుకున్నాం. తర్వాత నే నతనితో చెప్పాను: "పాల్‌పెట్రోవ్! నేను చాలా కాలంనుంచి నా అదృష్టాన్ని వివంగా పరీక్షించు కోవాలని తలపోస్తున్నాను. ఈ విషయాల్లో నువ్వు అనుభవశాలివి. కాబట్టి యేం చెయ్యాలో, యెలా చెయ్యాలో కాస్త నువ్వు నాకు సలహా యిచ్చి సహాయం చెయ్యి"

"హుఁ!" అన్నాడతను. "సలహా కేం, సవాలక్ష సలహాలివ్వొచ్చు! కాని, నువ్వే యేదో ఒకపని యేదుకుని, స్వంత బాధ్యతమీద, యితరుల సహాయం లేకుండా చేసుకోలేవూ? ఉదా

హరణకి చూడు!.... అబాయిమోవు వున్నాడే—కలప అడితీనుంచి వోర్కాన్ని గుండా తాతలనాటి పాత గుర్రబ్బగ్గీ మీద ఒంటరిగా తిరిగి వస్తూంటాడు. అతని దగ్గర డబ్బెప్పుడూ వుంటుం దన్న సంగతి నీకు తెలుసుగా? దానికితోడు మేస్త్రీ దగ్గరనుంచి వారాని కొకసారి అమ్మకపు సొమ్ముకూడ తీసుకుంటాడు. వాళ్ల రోజువారీ అమ్మకాలు మూడువందల రూబుల్సుకు తక్కువ కాకుండా వుం టాయి. ఆ లెక్కన వారానికి కెంత అయిందో చూడు. అబాయి మోవ్ దగ్గర అంత మొత్తం వుంటుందన్నమాట. ఏమంటావ్? అన్నాడు. నేను ఆలోచనలో పడ్డాను. అబాయిమోవ్ - నేను వెనుక పనిచేసిన దీ కలపవర్తకుని వద్దనే. అంచేత మరీ మంచిది. నన్ను ఉద్యోగంలోంచి ఊడపీకి జైలుకు పంపినందుకు ప్రతీకారం చేసినట్టూ అవుతుంది: ఒక్కసారిగా రెండువేలకు మించిన పెద్ద మొత్తాన్ని కాజేసినట్టూ అవుతుంది. అంటే పుణ్యం, పురుషార్థం కూడా నన్నమాట.''

"నేను బాగా ఆలోచించాలి'' అన్నాను.

"ఏ పనైనా బాగా ఆలోచించిన తర్వాతే సనుకో అన్నాడు పాల్ పెట్రోవ్.''

అనిచెప్పి ఎమిలియాన్ మౌనం దాల్చి నెమ్మదిగా సిగ రెట్టు చుట్టుకో నారంభించాడు. సంజ కెంజాయలు కాంతి దక్కి వెల వెల పోతున్నాయి. అంత కంతకు చీకటితెరచే కప్పబడు తున్న ఆకాశంలో యిటునటు కదులుతూన్న మబ్బుతునకల చుట్టూ గులాబిరంగు అంచువలె దర్శనీయ మవుతోంది. స్టెప్పీ అంతా అతి నిరవంగా వుంది. సముద్ర కెరటాల హోరు ఆ నిరవతను

మరింత అధికం చేస్తోంది. నలుదిశలనుండీ నీడవలె చీకట్లు ప్రసరించి, స్టెప్పీ మీదుగా సాగివచ్చి మాచుట్టూ ముసురుకో నారంభించాయి. నక్షత్రాలు ఒక్కటొక్కటిగా ఉదయించి, నీలి ముఖమల్ గుడ్డ పరచినట్లున్న దక్షిణాకాశాన్ని అలంకరించడానికై కొత్తగా తయారుచేసిన వాటివలె తళతళ మెరుస్తున్నాయి.

"సరే, తర్వాత- తమ్ముడూ!- నా స్నేహితులతో యీవిషయమై సంప్రదించి, ఆ రాత్రే వోర్స్క్లా దగ్గర పొదల్లో దాక్కున్నాను. నాచేతిలో అర్ధమణుగు బరువుగల యినుపకడ్డీ వుంది. ఇదంతా జరిగింది అక్టోబరు మాసాంతంలో ననుకుంటాను. మానవుని ఆత్మ లాగానే ఆ రాత్రికూడ గాడాంధకారంగా వుంది. స్థలం కూడ మంచి అనువుగా వుంది. సమీపంలోనే ఒక దొక్కువంతెన వుంది. చివరి కర్రలు కదిలిపోవడంమూలాన అతను నెమ్మదిగా వెళ్లవలసి వుంటుంది. నేను పడుకుని యెదురు చూస్తున్నాను. అప్పటికి నాకోపం పారం ముట్టింది. ఒక్క దెబ్బలో ఫైసల్! తేలికే ననుకున్నాను...." ఎమిలియాన్ లేచి నిలబడ్డాడు.

"ఏం, సరే, .... ఆవిధంగా పడుకుని సిద్ధంగా వున్నాను. ఒకేదెబ్బ!—దాంతో సరి. డబ్బుపంచి లంకించుకునేదీ, పరుగెత్తేది—అంతే. దెబ్బతో దేవలోకం చూస్తాడు!"

"ఏం, మనిషి స్వతంత్రు డనుకుంటున్నావు కాబోలునేం నువ్వు, తమ్ముడూ? తెలివి తక్కువ. రేపు ను వ్వేం చేస్తావో చెప్పగలవా యిప్పుడు? వచ్చినా చెప్పలేవు. రేపు కుడిప్రక్కనే పోతావో, ఎడమ ప్రక్కనే పోతావో కూడ చెప్పలేవు. సరే, తర్వాత....నే నలాగే కాచుకుని వున్నానా, జరిగింది మాత్రం

వేరొకటి. బొత్తిగా అర్థంలేని పని జరిగిందనుకో!"

"చూస్తిని కదా: పట్నాన్నుంచి యెవడో వస్తున్నాడు. తూలిపోతున్నాడు. బహుశా డోసు యెక్కువైందేమో... చేతిలో దుడ్డుకర్ర వుంది. ఏదో గొణుగుతున్నాడు. అసందర్భంగా మాట్లాడుతూ మధ్య మధ్య అరుస్తున్నాడు. నేను చెవులు నిక్కపొడుచుకుని విన్నాను. ఏడుస్తున్నాడు .... మరింత దగ్గరకు వచ్చాడు. నేను పరీక్షగా చూస్తిని కదా— ఆవ్యక్తి పురుషుడు కాదు, స్త్రీ! 'ఛూ! దగ్గరకు రా నీ పని పడతాను' అనుకున్నాను. ఆమె తిన్నగా వంతెన దగ్గరకు వచ్చి, ఎందుకు ప్రియా! అంటూ విలపించింది. తమ్ముడూ! ఆవిడ యెల్లా విలపించిం దనుకున్నావ్! నావళ్లు జలదరించిం దనుకో. ఇదేం చిత్ర మనుకున్నాను. ఆవిడ తిన్నగా నా వైపుకే వచ్చింది. నేను నేలకు కరచుకుపోయాను. వళ్లంతా కంపిస్తోంది... నా ఉద్రేక మంతా యెక్కడ చచ్చిందో! ఏం, అంత కంతకు ఆవిడ దరికే వచ్చేస్తోంది. మళ్లీ "ఏమిటి? ఎందుకు?" అంటూ అరిచింది....నా ప్రక్కనే దభేలున కూలబడింది. ఆవిడ విలపించడం మొదలెట్టింది తమ్ముడూ! చెప్పశక్యం కాదనుకో. వింటూంటే నా హృదయం తూట్లు పడిపోయింది. అప్పటికీ నేను మెదలకుండా ఊరుకున్నాను. ఆవిడ శోకాలు పెడుతూనే వుంది. నాలో ఆరాటం పెరిగింది. పారి పోదా మనుకున్నాను. అప్పటికి చంద్రుడు మబ్బుచాటునుంచి బయటపడి పిండి ఆరబోసినట్లు వెన్నెలను వెద జల్లుతున్నాడు. పరిస్థితి దారుణంగా మారి పోయిం దంటే నమ్మ! మోచేతులమీద ఆని కొద్దిగా లేచి, ఆమెకేసి చూశాను. తమ్ముడూ! చెప్తే నమ్మతావో

నమ్మవో గాని. దానితో నా ప్లానులన్నీ ఎగిరిపోయాయి. చూసే కొద్దీ నా గుండె మరింత వేగంగా కొట్టుకో నారంభించింది. చిన్నదే, వయస్సేమీ పైబడలా .... పట్టుకుచ్చుల్లాంటి ముంగుర్లు చెక్కిళ్ల మీద నాట్య మాడుతున్నాయి; పెద్ద పెద్ద కళ్లు చాలా అందంగా వున్నాయి....ఆమె భుజాలు కంపిస్తున్నై. కళ్ల నుంచి సంతత ధారగా కన్నీటి చుక్కలు పడుతున్నై.

"తమ్ముడూ! నా హృదయం జాలితో నిండిపోయింది. మెల్లగా దగ్గాను—అది విని ఆవిడ యెల్లా అరిచిందని! 'ఎవరు? ఎవరిక్కడ?' అని. ఆవిడ బేజారైపోయింది. వెంటనే నేను లేచి నిలబడి "నేను" అన్నాను. "ఎవరు నువ్వు?" అం దామె. ఆమె కళ్లు యింతం తయ్యాయి. దేహ మంతా వణికిపోతోంది. "ఎవరు నువ్వు?" అని ఆమె మళ్ళీ అడిగింది.

ఎమిలియాన్ బిగ్గరగా నవ్వాడు.

"నే నెవరినని చెప్పను? ముందు ముఖ్యంగా 'నీకు నే నేమీ హాని చెయ్యను. నే నేదో ఆకలిదండుకు చెందిన మామూలు మనిషినిలే' అని చెప్పాను. అంతే - నీటుగా టొంకా సన్నమాట! నే నిక్కడ ఒక షావుకారును ఖూనీ చెయ్యడానికి కూర్చున్నానని ఆవిడతో చెప్పలేకపోయాను. అదీ అసలు సంగతి!

"ఏమైతే నాకేంలే" ఆవిడ జవాబిచ్చింది "కాలువలో దూకి ప్రాణాలు తీసుకుందామని వచ్చిన నాకు నువ్వెవరివైతే నేంలే" ఆ సంగతి ఆవిడ యెల్లా చెప్పిం దంటే - తమ్ముడూ! అది వినేసరికి నా దేహం కంపించి పోయింది - ఇదేం యేగతాళి కాదు. ఆవిడ నిజంగా అందుకే వచ్చింది. అప్పు డిక నే నేం

చెయ్యాలి?"

ఎమిలియాన్ విచారంగా చేతులు జాపి నా వంక చూసి, సహృదయంతో నవ్వాడు.

"తమ్ముడూ! అకస్మాత్తుగా నే నప్పుడు మాట్లాడ నారంభించాను. నేను దేన్నిగురించి మాట్లాడానో తెలియదు గాని, నా మాటలు నాకే యెంతో మధురంగా వినసొంపుగా తోచాయి. ఆమె చిన్నదనీ, అందాల భరిణె అనే విషయం మీదనే యెక్కువగా మాట్లాడాను. అందంలో కూడ అషామాషీ అందం కాదు. మచ్చలేని అందం. ఆవిడ పేరు లీజా. అప్పుడు మాట్లాడేశాను. ఏమిటో నాకు తెల్షియకుండానే. నా హృదయ కవాటం తెరుచుకుంది. ఆమె చెవులు రిక్కించి నా మాటలు శ్రద్ధగా వింది. ఆఖరున అకస్మాత్తుగా యెలా నవ్విందని!...."ఎమిలియాన్ స్టెప్పీ ప్రతిధ్వనించేటంత బిగ్గరగా అరిచాడు. బిగించిన పిడికిళ్లు గాలిలో ఊపుతూ దగ్గుత్తికతో చెప్పుకు పో సాగాడు.

"ఆవిడ నవ్వుతో నేను ద్రవించిపోయాను. వెంటనే ఆమె ముందు మోకరిల్లి 'అమ్మాయ్! అమ్మాయ్!' అన్నాను. అంతే, అంతకు మిక్కిలి మాటలు పెగల్లేదు. ఆవిడ నా తలను తన చేతుల్లో పొదువుకుని, సినిమాలోలాగ నా కంళ్లలోకి చూసి మందహాసం చేసింది. ఏమిటో చెప్పబోతున్నట్లు పెదవులు కదిపి మళ్ళీ సంకోచించింది. అంతలోనే ధైర్యం తెచ్చుకుని 'ప్రియ మిత్రుడా! నువ్వూ నావలెనే విచారంగా వున్నావు! అవునా? చెప్పు. నాతో చెప్పు!' అంది.

"తమ్ముడూ! అదీ జరిగిన సంగతి. అంతేకాదు ఆమె —

నా నుదురుమీద ముద్దు పెట్టుకుంది.... ఆలోచించు, చిత్రంగా లేదూ? అసలు నువ్వు నమ్మావా అని; నువ్వు నమ్ముతావో నమ్మవో గాని భగవంతుని సాక్షిగా నా నలభై యేదేండ్ల జీవిత మంతటిలోనూ అదే మధుర క్షణ మనుకో! సరే, సరే; అసలు నే నక్కడికి వెళ్ళిం దెందుకు; జరిగిం దేమిటి; జీవితం యింతే!"

తలను చేతులపై వాల్చుకుని అతను మౌనం దాల్చాడు. ఆ కథలోని అపూర్వత నాలో విచారాన్ని రేకెత్తించింది. మౌనంగా సముద్రం వంక చూడసాగాను. గాఢంగా నిద్రిస్తోన్న ఒక బ్రహ్మాండమైన వ్యక్తి రొమ్ము ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు అనుగుణంగా పైకీ, క్రిందికీ కదిలేట్లు సముద్రం కొట్టుకుంటోంది.

"సరే, ఆవిడ లేచి నాతో అంది: 'న న్నింటి దగ్గర దిగబెట్టు' మని. మేము కలసి వెళ్ళాం. నేను వెళ్ళానేగాని భూమిమీద నడచినట్లు లేదు. మేఘాలపై తేలిపోయిన ట్లనిపించింది. కాని ఆమె అంతసేపూ యేవేవో కబుర్లు చెబుతూనే వుంది. తన తల్లిదండ్రుల కామె ఒక్కతే బిడ్డట. తండ్రి షావుకారుట — హుం; వింటున్నావా? ఆమె శీలం చెడిందిట; తర్వాత ఒక విద్యార్థి వచ్చి ఆమెకు చదువు చెప్ప నారంభించాడుట; క్రమేణా ఒకరి నొకరు ప్రేమించుకున్నారుట; తర్వాత అతను వెళ్ళిపోయాడు, ఆమె మాత్రం అతని రాకకై యెదురు చూస్తోంది — అంటే, అతని చదువు పూర్తియై, తిరిగి వచ్చి తనను పెండ్లి చేసుకుంటాడని— అదిన్నమాట ముందు వాళ్లు చేసుకున్న ఏర్పాటు. కాని అతను రానేలేదు. 'నిన్ను పెండ్లి చేసుకో జాలనందుకు విచారిస్తున్నాను' అంటూ ఒక వుత్తరం మాత్రం రాశాడుట. మరి దాంతో ఆమె

మనస్సు వికల మైపోయింది. సరే, యీ విధంగా తన జీవిత కథ అంతా నాతో వలపోసుకుంది. అల్లాగ కబుర్లు చెప్పుకుంటూ ఆవిడ యింటికి జేరుకున్నాం. 'ప్రియ మిత్రుడా! యిక మరి సెలవు!' అని చెప్పింది. 'రేపు నే నిక్కడనుంచి వెళ్ళిపోతాను. నీ కేమన్నా డబ్బు అవసర ముంటుందేమో? మొహమాటపడక చెప్పు!' 'లేదు, అవసరం లేదు, నీ దయకు కృతజ్ఞుణ్ణి!' 'మ రేం ఫర్వాలేదు, మొహమాటపడక కావలసింది అడిగి తీసుకో.' ఆమె బలవంత పెట్టసాగింది. నేను జీర్ణవస్త్రాలతో వున్నాను. అయినా 'అక్కర్లేదు' అనే చెప్పాను. ఏమిటో తమ్ముడూ! అప్పుడు డబ్బు సంగతి ఆలోచించలేకపోయా ననుకో. ఆమె దగ్గర సెలవు తీసుకున్నాను. ఆమె యెంతో మృదువుగా చెప్పింది: 'నిన్ను నా జీవితంలో మరచిపోను. నువ్వు చాలా చిత్రమైన మనిషివి' అందామె. 'కాని నాకు నీవంటి....' సరే, పోనియ్యి" అని ఎమిలియాన్ ఆపేసి, సిగరెట్టు కాల్చ నారంభించాడు.

"ఆమె లోనికి వెళ్లిపోయింది. గేటుదగ్గరవున్న బల్ల మీద నేను విచారంగా కూర్చుండి పోయాను. ఇంతలో నైట్‌వాచ్ మన్ అక్కడికి వచ్చాడు. 'ఇక్కడ తచ్చాడుతున్నావు దేనికి? ఏమన్నా కన్నం వెయ్యాలని చూడటం లేదు కదా?' అన్నాడు. ఆ మాటలు వినేసరికి నా హృదయం రగులుకుపోయింది. ఒళ్లురాలేట్టు ఒక్కటి అంటించాను. మొర్రోమని అరుపు! ఈలలు .... పోలీసు స్టేషనుకు లాక్కుపోయారు! పోలీసు స్టేషనుకు కాదు కదా, నరకానికి తీసుకుపోతే మాత్రం నా కేం లెఖ్ఖ! పనిలో పని అని మరొక్క చపేటా అంటించి, తెల్లవార్లూ అక్కడే కూర్చున్నాను.

ఉదయం నన్ను విడిచి పెట్టేశారు. తిన్నగా పాల్ పెట్రోవ్ దుకాణానికి వెళ్లాను. 'ఎక్కడ చక్కర్లు కొడుతున్నావోయ్?' నవ్వుతూ అతను ప్రశ్నించాడు. అతనివంక చూశాను — నిన్నటి మనిషే కాని అతనిలో యేదో మార్పు కనిపించింది. కొత్త మనిషిలా కనిపించాడు. సరే, పూస గ్రుచ్చినట్లు జరిగిన కథంతా అతనికి చెప్పాను. శ్రద్ధగా విని 'ఎమిలియాన్ నికిటిచ్!' అతనన్నాడు - 'నువ్వు ఒట్టి శుంఠవి. నీవల్ల వీసమెత్తు పని జరగదు. ఇక నువ్విక్కడినుంచి దయచేస్తే చాలా బాగుంటుందేమో?' అవును. అతను చెప్పింది కూడా సబబుగానే కనిపించింది. నేను కాళ్లీడ్చుకుంటూ వెళ్లిపోయాను. అదీ జరిగింది. తమ్ముడూ, యిదీకథ"

అతను తల క్రింద చేతులు పెట్టుకుని, నేలమీద బోర్ల పడుకుని నీలాకాశంలో నిగ నిగ మెరిసే తారలకేసి చూస్తూ మౌనం దాల్చాడు. చుట్టూ నిశ్శబ్దం తాండవిస్తోంది. సముద్ర ఘోష మరింత అస్పష్టంగా, మృదువుగా, నిట్టూర్పు విడిచినట్లు వినబడ సాగింది.



# మరపురాని రాత్రి



పూర్వం ఒక శరద్రాత్రి జరిగిన వింత సంఘటన ఒకటి జ్ఞప్తికి వస్తోంది. నే నొక రోజున ఒక కొత్తపట్నం చేరుకున్నాను. క్రొత్తగా వెళ్లానేమో. ఆ పట్నంలో నాకు తెలిసిన వా రెవ్వరూ లేకపోయారు. దానికి తోడు నా జేబులో పైసాకూడా నిండుకుంది. తల దాచుకునేందుకు నీడకూడ లభ్యంకాలేదు.

పట్నం జేరుకున్న మొదటిరోజుల్లోనే సాధ్యమైనంత వరకు దుస్తుల దగ్గరనుంచీ అమ్ముకుని తినియుండటంచేత పట్నం విడిచి ఓడరేవున్న ఉప్పుటేరుకు చేరుకున్నాను. ఓడ వర్తకం జోరుగా జరిగే సమయంలో కూలీల కోలాహలంతో అక్కడ మహా సందడిగా వుంటుంది. కాని, నేను చెప్పబోయేకథ జరిగినది అక్టోబరు మాసాంతంలో కావడంచేత అక్కడ నరసంచారంలేక బహు నిశ్శబ్దంగా వుంది.

తడి యిసుక మీద టప టపా అడుగులు వేసుకుంటూ. ఆహారంగా ఉపయోగించే వస్తు వేదన్నా. ఎక్కడన్నా లభిస్తుందేమో నని ఒళ్లంతా కళ్లు చేసుకుని చూస్తూ. కడుపునిండా ఆహారం లభిస్తేయెంత బాగుండునా అని తలపోస్తూ నిర్జన గృహాలకు. మూసియున్న పెట్టె కొట్లసమధ్య ఒంటరిగా సాగిపోతున్నాను.

ప్రస్తుత సామాజిక సాంస్కృతిక పరిస్థితుల్లో శారీరక క్షుద్బాధను తీర్చడం కన్న మానసిక క్షుద్బాధను తీర్చడమే తేలిక. వీధి వెంబడి పోతూంటే బ్రహ్మాండమైన భావాలు దృగ్గోచర మవు తాయి. వాటి బాహ్యాకారాలనుబట్టి అవి లోపల కూడ బాగానే వుంటాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. వాటిని చూస్తుంటే శిల్పాన్ని గూర్చి, ఆరోగ్య నియమాలను గూర్చి బహు వివేక వంతమైన, మహోన్నతమైన భావాలు మనసులో కలుగుతాయి. మెప్పుగా, సుఖంగా వుండే దుస్తులు ధరించిన భోగులు వాటిలో నివసిస్తారు. మనకు వారు సాధ్యమైనంత దూరంగావుండి, సౌమ్యంగా మాట్లాడుతూ, సాధ్యమైతే అసలు మన ఉనికినే గుర్తించకుండా వుండేందుకు తంటాలు పడుతూంటారు. ఏమైనా, ఆకలి గొన్నవాని ఆత్మ బొజ్జ నిండినవాని ఆత్మకన్న ఆరోగ్య వంతము, దయాపూర్ణము అయ్యుంటుంది. దీన్ని బట్టి ఆకలి దండును గూర్చి మీరు సదభిప్రాయాన్నే యేర్పరచుకోవచ్చు....

సాయంత్రమైంది. చిటపటమంటూ చినుకులు పడనారం భించాయి. ఉత్తర దిశనుండి గాలి హోరుమని వీస్తోంది. గాలి తాకిడికి ఖాళీ పెట్టె కొట్లు రొద చేస్తున్నాయి. మేకు లూడిన హోటలు కిటికీలు దబ దబ కొట్టుకుంటున్నాయి. ఉప్పుటేటి కెర టాలు ఒకదాని వెంబడి మరొకటి ఉవ్వెత్తున లేచి ఒడ్డును తాకు తున్నాయి.

ఉత్తరపుగాలి ఆ రాత్రే తనకు వేయబోయే మంచు సంకెల నుంచి పారిపోనామా అని ప్రయత్నిస్తున్నట్లుగా నది వడి వడిగా ముమ్ముందుకు పరుగిడిపోతోంది.

ఆకాశం మేఘాచ్ఛాదితమై నల్లగా వుంది. సుంఖగోచరం కాని చిన్న చిన్న వర్ష బిందువు ఎ నిరంతరంగా కురుస్తున్నాయి. ఒడ్డు మీద కొమ్మలు విరిగి వికారంగా వున్న రెండు ముసలి విలో చెట్లు, వాటి వేళ్లకు బంధింపబడి తలక్రిందులుగా పడియున్న ఒక నావ పరిసర ప్రకృతిలోని శోక వాతావరణాన్ని మరింత వృద్ధి చేస్తున్నాయి.

అడుగు పగిలి బోర్లింపబడిన నావ, ఆకులు రాలిపోయి మోడులైన విల్లో చెట్లు చాలా వికారంగా వున్నాయి. పరిసరాలన్నీ నిర్జీవంగా, నీరవంగా, నిర్జనంగా వున్నాయి. ఆకాశం సంతత ధారగా బాష్పాలు రాలుస్తున్నట్లు వాన కురుస్తోంది. నన్నొక్కడినీ సజీవిగా మిగిల్చి పరిసర ప్రకృతి యావత్తూ నశించిపోతున్నట్లు, త్వరలో నాకు కూడ చలివావు దాపురించబోతున్నట్లు తోచింది.

అప్పుడు నావయస్సు పద్దెనిమిది సంవత్సరాలు—— అంటే మంచి యౌవనంలో వున్నా నన్నమాట!

చెమ్మగా, చల్లగా వున్న యిసుకగట్టువెంట ముందుకు సాగిపోయాను. చలికీ, ఆకలికీ నా దంతాలు కటకటలాడుతు న్నాయి. పెట్టె దుకాణాల చుట్టూ తినడాని కేమన్నా దొరుకు తుందేమోనని వృధాగా పరిశీలన చేస్తూ తిరుగుతూండగా ఒక కొట్టు వద్ద స్త్రీ దుస్తులలో ఒక మానవమూర్తి నేలమీద వంగి వుండటం నాకళ్ల బడింది. దుస్తులు వానకు తడిసి గుండ్రంగా వంపు తిరిగిన ఆమె భుజాలకు అంటుకు పోయాయి ప్రక్కనే వంగి ఆమె చేస్తూన్న దేమిటో నని చూశాను. ఒక పెట్టె దుకాణం క్రింద యిసుకలో కన్నం చేస్తోంది.

ఆమె ప్రక్కనే చతికిలబడి "ఎందు కలా తవ్వుతున్నావ్?" అని అడిగాను.

ఆమె అదిరిపడి, భయంతో వణుకుతూ, తొందరగా లేచి నిలబడింది. విశాలమైన ఆమె నేత్రాలు బూడిద వర్ణంగా వున్నాయి. సుమారు నా ఈడులోనే వున్న ఆయువతి ముఖం పొందికగా, అందంగా వుండవలసిందే గాని మూడు పెద్ద గాయపు మచ్చలు ఆమె ముఖాన్ని కొంతవరకు వికృతం చేశాయి. రెండు కళ్లక్రిందా రెండు విస్నవీ, కనుబొమల మధ్యగా నుదుటిమీద పెద్ద దొకటీ వుంది, ఆగాయాలు తమ సృష్టి కర్త పనితనాన్ని, మానవాకృతిని వికారం చేయడంలో అతనికి గల నేర్పును వేనోళ్ల చాటుతున్నాయి.

ఆమె నావంక తదేక దృష్టితో చూస్తోంది. క్రమ క్రమంగా ఆమె కళ్లలోని భయం అదృశ్యం కా నారంభించింది. చేతుల కంటిన యిసుకను దులిపేసి, వలసు చుట్టిన రుమాలును సర్దుకుని, జంకుతూ అడిగింది:

"నీకూడా ఆకలిగా వుం దనుకుంటా?.... అయితే మరి చూస్తావేం. తవ్వు....నాచేతులు నొప్పి పెడుతున్నాయి. అక్కడ— పెట్టె కొట్టు కేసి త లూపింది — అక్కడ తప్పకుండా రొట్టె దొరుకుతుందని నా నమ్మకం.... మాంసం కూడా వుండొచ్చు."

నేను మెదలకుండా త్రవ్వసాగాను. ఒక్కక్షణం ఆగి, నావంక పరీక్షగాచూసి, ఆమెకూడా వంగి నాకు సహాయపడ సాగింది.

నిశ్శబ్దంగా మాపని కొనసాగించాం. చట్టము, నీతి- నియమాలు. ఆస్తి హక్కులు మొదలైన విషయాలను గురించి

జీవితంలో అడుగడుగునా మనం గుర్తుంచుకోవాల్సిన అవసరాన్ని పెద్దలు, విద్యాధికులు బోధించేమాట నిజమే గాని, సరిగా ఆ క్షణంలో యీ విషయాలేవీ నా మనస్సుకు స్ఫురించలా. పెట్టె కొట్టు క్రింద కన్నం త్రవ్వడంలో నిమగ్నుడనై పోయిన నాకీ విషయాలు స్ఫురించక పోవడమే కాదు- నిజానికి దొరకబోయే రొట్టెకు మినహా యీ ప్రపంచాన్నే పూర్తిగా మరచి పోయాను.

సాయంత్రమైంది. చీకటి దట్టమవుతోంది. తేమ, చలి అధికమైనై. సముద్ర ఘోష మరింత దగ్గరగా వినిపించ సాగింది. వాన జల్లులు కొట్టుచెక్కలను తాకి అట్టహాసం చేస్తున్నాయి. .... దూరాన రాత్రికాపలావాడు చేస్తున్న టకటక శబ్దం గాలిలో కలిసి పోతోంది.

"తీరా ఇంతకూ దాని అడుగు గట్టిగా లేదు కదా?" ఆ యువతి అతి మృదువుగా అన్నది. ఆమె ప్రశ్న అర్థంకాక నేను మెదలకుండా వూరుకున్నాను.

"నిన్నే! కొట్టుకి- అడుగున చెక్కవుందేమో? ఉంటే మన శ్రమ అంతా వ్యర్థమన్నమాటే. అడుగున రాతి పలకల్లాంటి దళసరి చెక్కలుంటే, మనం కన్నం తవ్వి మాత్రం లాభ మేమిటి? ... వాటిని తియ్యడ మెట్లా? అంతకన్నా తాళం పగలకొట్టడమే తేలికేమో. . ఈ తాళంకూడా తాతలనాటిదిలా గుందిలే...."

అటిక పిడతల్లాంటి ఆడవాళ్ల బుర్రల్లో సాధారణంగా మంచి ఊహలు పుట్టవు. ....అంటే అసలే పుట్టవని కాదు .... మంచి ఊహలంటే నాకు గౌరవం జాస్తి కావడంచేత, వాటిని సాధ్యమైనంత యెక్కువగా అమల్లో వుంచడానికి ప్రయత్నిస్తూ

వుంటాను.

తాళం గట్టిగా గుంజి ఊడబెరికాను....నా సహచరి ఒక్క త్రుటిలో వంగి, పాములాగా జరజరపాకి కొట్టులో దూరింది. లోపలినుంచి ఆమె హెచ్చరిక వినపడింది:

"బలేవాడి వోయ్!"

మహావక్తయైన మగవాడు పొగడుతూ యిచ్చిన మహోపన్యాసం కంటె సామాన్య స్త్రీ మెచ్చుకుంటూ చేసిన ఒక చిన్న హెచ్చరికే యెక్కువ విలువైనదని నా విశ్వాసం. కాని, అప్పుడంటారా— అప్పటి నా మానసిక స్థితే వేరు. నా స్నేహితురాలి మెచ్చుకోలును అలావుంచి బెదురుగా అడిగాను ముక్తసరిగా.

అస లింతకీ యేమన్నా వున్నట్టా?

అక్కడవున్న వస్తువుల పేర్లన్నీ ఆమె యేకరువు పెట్ట సాగింది.

సీసాలతోవున్న ఒక బుట్ట....ఖాళీసంచులు....ఒక గొడుగు ....యినుప బాల్చి వగైరా.

వీటిలో ఒక్కటీ తినేందుకు పనికి వచ్చేది కాదు. నా ఆశలు అడుగంట నారంభించాయి. కాని, అంతలోనే ఆమె అకస్మాత్తుగా సంతోషభరితమైన గొంతుతో అరిచింది:

"ఆఁ, వుంది, వుంది!"

"ఏమిటి?"

"రొట్టె....ఒక పెద్ద ముక్క.... కొద్దిగా తడిగావుంది.... ఐతేనేం, యిదుగో పట్టుకో!"

ఒక రొట్టె నా కళ్లముందు దొర్లిపడింది. దాని వెనుకే

సాహసికురాలైన నా స్నేహితురాలుకూడ వచ్చింది. అప్పటి కప్పుడే నేనొక ముక్కవిరిచి నోట కుక్కుకుని నములుతున్నాను.

"మరి, నాకు కొద్దిగా ఇయ్యి.... మన మిక యిక్కడుండ కూడదు. ఎక్కడికి పోదా మబ్బా?" అని నలువంకలా అంధకారం లోకి తీక్షణంగా చూసింది.... అంతా చీకటిగా, చల్లగా వుంది. వింత వింత శబ్దాలు వినవస్తున్నాయి.

"అదుగో, అక్కడొక బోర్లించిన పడవ వుంది.... అక్కడికి పోదామా?"

"సరే, వెళ్దాం!" త్రోవలో దొంగసొత్తును పంచుకొని, దానితో మానోళ్లను నింపుకుంటూ మే మక్కడికి జేరాం. వాన జోరైంది. వాన తాకిడికి నది రోదిస్తోంది. ఎవరో దూరాన వేసిన యీల మాచెవులకు సోకింది. ఆ యీల ఎవ్వరినీ లెక్కచేయని యెవరో మహాశక్తివంతుడు ప్రస్తుత సృష్టినీ, ఏహ్యమైన ఆ శరద్రాత్రి కథానాయకీ నాయకులమైన మమ్మిద్దరినీ శపిస్తున్నట్లుంది. ....ఆ యీల నాలో బాధాకరమైన నిరుత్సాహాన్ని జనింపచేసింది. అంతమాత్రాన భోజన కార్యక్రమా న్నేమీ నేను మందగింపచెయ్యక ఆప్యాయంగా తింటూనేవున్నాను. ఆయువతికూడ తిండిలో నాకు తీసిపోకుండా నా ఎడమ ప్రక్కనే నడచి వచ్చింది.

"నీ పేరేమిటి?" యాదాలాపంగా అడిగాను.

"నటాషా" బిగ్గరగా నముల్తూ క్లుప్తంగా ఆమె జవాబిచ్చింది.

ఆమె పంక చూశాను: నా హృదయం బాధాకలితమై ముకుళించుకుంది. ముందు అంధకారంలోకి చూశాను, విధివదనం

వికటాట్టహాసం చేస్తూ నావంక నిగూఢమైన శిలల వృక్షాలు బరవుతోన్నట్టుంది.

అవిరామంగా పడుతున్న వానచినుకులు టపటపమని పడవమీద పడుతూ దుఃఖావేశ జనకమైన భావాలు కలిగిస్తున్నాయి. పగిలిన పడవ అడుగు భాగంలోనుంచి గాలిదూరి యీదురోమను శబ్దం చేస్తోంది. ఉవ్వెత్తున లేస్తున్న ఉప్పుటేటి కెరటాలు ఒడ్డును తాకి రొదచేస్తున్నై. ఆ రొద విన్నకొద్దీ యేదో అపారమైన కష్ట గాథను ఏటి కెరటాలు ఒడ్డుతో వెళ్లబోసుకుంటున్నాయా అని పిస్తోంది. వాన చప్పుళ్లతో, కెరటాల విసుపులతో కలసి పడవలోకి భూమాత భారంగా వదలిన దీర్ఘ నిట్టూర్పువలె వినవచ్చింది. మహోజ్వల కాంతివంతము, వెచ్చనైన వేసవినుండి చలి, తేమలతో కూడిన శరదృతువులో యేటేటా కలిగే యీ మార్పు భూమాత కెంత బాధాకరమోకదా! ఆ రాత్రి అంతా ఎడారిమీద గాలి చెర్లాడుతూనేవుంది. నదీమతల్లి హంసరాగాలు తీస్తూ ముమ్ముందుకు సాగి పోతూనే వుంది.

పడవ క్రింద మాపని బహు యిరకాటంగా వుంది. తేమకు జోడు చలికూడా తీవ్రంగా వుంది. అడుగు పగుల్లోనుంచి వర్ష ధారలు పడుతున్నాయి.... గాలి విసుర్లు లోపలికి దొరబడు తున్నాయి. మే మిద్దరం వడవడ వణికిపోతూ మౌనంగా కూర్చున్నాం. నాకు నిద్రపోవాలనిపించినట్లు జ్ఞాపకం. నటాషా పడవ అంచుకు జేర్లబడి, చేతులు మోకాళ్లచుట్టూ పెనవేసుకొని, మోకాళ్లమీద గడ్డం ఆన్చి, ఉండలా చుట్టుకుని పడవ బీటలగుండా తదేకదృష్టితో నదివేపు చూస్తోంది. కళ్లక్రింది గాయాలమూలాన ఆమె కళ్లు

మరింత విశాలంగా కనిపిస్తున్నాయి. ఆమె మౌనము, నిస్తబ్ధత నాలో క్రమక్రమంగా భయాన్ని రేకెత్తించాయి .... ఆమెతో మాట్లాడాలనేవుంది; గాని, ఎలా ప్రారంభించాలో మాత్రం తెలియటంలా.

ముం దామే ప్రారంభించి నా చిక్కును విడదీసింది.

"ఎంత దుర్భర జీవితం! ...." గృఢస్వరంతో, విస్పష్టంగా అన్న దామె.

కాని ఆమె యీ వాక్యంలో అసంతృప్తి కన్పించలా. అసంతృప్తికన్నా అలక్ష్యమే ఆ మాటల్లో అధికంగా స్ఫురించింది. ఒక ప్రాణి తనకు చేతనైనట్టుగా ఆలోచించిన మీదట వెల్లడించిన నిర్ణయమిది. ఆ నిర్ణయాన్ని ఖండించాల్సిన అగత్యంకూడ నాకేమీ కన్పించక పూరుకున్నాను. నా ఉనికినే గుర్తించనిదానివలె ఆమె కూడ నిశ్చేతనంగా కూర్చుండి పోయింది.

"చచ్చిపోయినా యింతకంటె బాగుండేది"

నటాషా సాలోచనగా తాపీగా కొనసాగించింది. అప్పుడైనా ఆమె స్వరంలో అసంతృప్తి ద్యోతమానం కాలేదు. దాన్నిబట్టి జీవిత సంకటాన్నుంచి తప్పించుకునేందుకు యీ జీవి ఒకే ఒక మార్గాన్ని కనిపెట్టగలిగిందనీ, అది 'చచ్చిపోవడం' మాత్రమే ననీ తేటతెల్లమైంది.

విస్పష్టమైన యీ ఆలోచన నాలో విపరీతమైన నిరుత్సాహాన్ని కలిగించింది. ఇం కేమాత్రం మౌనం దాల్చినా తప్పకుండా యేడుపు వచ్చేస్తుం దనిపించింది. ఛీ! ఛీ ఆడవాని ముం దేడ్వడమా! అందులోనూ ఆమె యేడ్వనప్పుడు! ఎంత సిగ్గుచేటుపని! ఆమెతో

మాట్లాడాలని నిశ్చయించుకున్నాను.

"నిన్నలా గాయపరిచిం దెవరు?" అడగటానికి అంత కన్నా తెలివైనప్రశ్న యింకొక టేదీ నాకు తోచలా.

"ఇంకెవ రున్నారు, పాష్కాయే ...." ఆమె బిగ్గరగా జవాబిచ్చింది.

"ఎవ రతను?"

"నా ప్రియుడే....రొట్టెలు కాలుస్తాడు...."

"అయితే నిన్నతను తరుచుగా కొడుతూంటాడా?"

"ఆఁ, తరుచుగా తంతూనే వుంటాడు! తాగినప్పుడల్లాను!"

అంటూనే నాకు మరింత దగ్గరగా జరిగి తన్నుగురించీ, పాష్కాను గురించీ, తమయిద్దరి మధ్యగల సంబంధ- బాంధవ్యాలను గురించీ చెప్పసాగింది. తానొక—'అనాథ'ట.... అతనేమో రొట్టెలు చేసేవాడట, అతని మీసాలు రాగివర్ణంగా వుంటాయట. అతను అకార్డియన్ వాయిస్తూంటే రాళ్లు కరుగుతాయిట. వేశ్యావాటికలో మొదటిసారి కలుసుకున్నప్పుడే తన్నతను బాగా ఆకర్షించాడట. ఎప్పుడూ నవ్వుతూ, త్రేలుతూ హుషారుగా ఉండి, శుభ్రమైన దుస్తులు, విలువైన కోటు, మెరిసే బూట్లు ధరించేవాడట. ఈ కారణాలవల్ల అతని నామె ప్రేమించటం, అతను 'అరువు'గానే వచ్చిపోతూండడం సంభవించిందట. తర్వాత తర్వాత విటులామెకు యీనాంగా యిచ్చే సొమ్మును తీసుకెళ్లి దానితో తప్ప తాగివచ్చి తన్ను బాదటం సాగించాడుట. పోనీ అంతతో ఆగినా బాగుండును—లప్పే, తన కండ్లముందే యితర యువతులతో సరసాలు సాగించ నారంభించాడట....

"నువ్వే చెప్పు, అది నా కెంత నామోషీ? పైవాళ్లకన్న నే నేమున్నా తీసిపోతే అనుకోవచ్చు. పోనీ అని వూరుకుంటే. నన్ను గడ్డిపరక మాత్రంగానైనా లెక్కచెయ్యడం లేదన్న మాటేగా; రాక్షసుడు! నిన్నకాక మొన్న, మా యజమానురాలి వద్ద సెలవు తీసుకొని అతని కొంపకి పోయి చూద్దునుకదా, దూంకా తప్ప త్రాగి అతని ఒళ్లో పడుకుని వుంది. అతనూ ఓ శ్లేరకుండా త్రాగి వున్నాడు. 'నువ్వు ఒట్టి లుచ్చావి! దగాకోరువి! దగుల్బాజీవి! రాక్షసుడివి!' అని మొహంమీదే తిట్టేశాను. అంతే, దాంతో అతను రెచ్చిపోయి నిర్దాక్షిణ్యంగా నా జుట్టుపీకి, వళ్లు హూనమయ్యేట్టు చావబాదాడు—సర్వవిధాల—పోనీ అంతటితో ఆగితే మేలే! చూడు, నా బట్టలన్నీ యెల్లా చించి పోగులు పెట్టాడో.... ఇప్పుడు నే నేం చెయ్యాలి చెప్పు? మా యజమానురాలి ముందుకు యేముఖంపెట్టుకుని వెళ్లను? నా గౌను, జాకెట్టు సాంతం చింపేశాడు—ఇంకా రెండు వుతుకులైనా పడలా .... ఐదురూపాయలు పెట్టి కొనుక్కున్నాను! .... నా తలరుమాలు కూడ లాగేశాడు. ....ఓయి భగవంతుడా! ఇప్పు డిక నా గ తేంకాను?" అని ఆమె ముంచుకొచ్చిన గాఢ విషాదపూరితమైన గద్గద స్వరంతో విలపించింది.

గాలి మరింత చల్లబడి హోరున వీస్తోంది ....నా దవుడలు కటకటలాడుతున్నాయి. ఆమె కూడ చలికి ముడుచుకుని నాదరికి సమీపించింది. ఆమె కళ్లలోని మెరుపు నాకు కనిపిస్తోనేవుంది.

"మీ మగా ళ్లంతా ఒట్టి దగుల్బాజీ బటాచోరులు. మిమ్మల్నసలు నేలకురాసి నాశనం చేసెయ్యాలి. చచ్చినా జాతి తలచ

కూడదు! శనికొట్టు పీనుగులు! .... ముందేమో కాళ్లా వేళ్లాపడి బ్రతిమాల్తారు; తోకలాడిస్తూ దీనంగా చూసే కుక్కల్లా చూస్తారు. నా లాంటి ఏ మూర్ఖురాలో మోసపోయి దగ్గరకు జేరనిస్తుంది: యిక చూసుకో! ఆ పిల్లని నిర్దాక్షిణ్యంగా కాళ్లక్రింద మట్టుపెట్టే స్తారు.....చిత్తకార్తె చీడ కుక్కలు!...."

తిట్టిందేగాని ఆమె తిట్లలో చురుకులేదు. ఆ 'చిత్తకార్తె కుక్కల' పట్ల ఆమె స్వరంలో ద్వేషంగాని, పగగాని ద్యోతకం కాలేదు. మొత్తంమీద ఆమె స్వరం విషయానికి తగ్గంత ఘాటీగా లేక పోగా మృదువుగానే వుందని చెప్పొచ్చు.

ఆసన్న మృత్యువు నెదుర్కొంటోన్న వాని మరణ వేదనే అట్టి వేదన గురించి చేయబడిన నిర్దుష్టము, కళా విశిష్టమైన వర్ణన కన్న యెప్పుడూ అతి సహజంగా, శక్తివంతంగా వుంటుంది. అదే విధంగా యీ విషయాలపై నేను పూర్వం చదివిన, యిప్పుడు చదువుతున్న పుస్తకాలకన్న, పూర్వము విన్న, యిప్పటికీ వి టూన్న మహోపన్యాసాలకన్న ఆమె తిట్లే నా మనస్సులో గొప్ప పరి ణామాన్ని కలిగించాయి.

నాకు చాలా అసహ్యమనిపించింది — ఆ భావం నాకు కలగడానికి నా సహచరి ఉపన్యాసంకన్న చలే పెద్ద కారణమని చెప్పొచ్చు. నాలో నేను మూలగ సాగాను. చలికి నా పంతాలు కటకటలాడుతున్నాయి.

సరిగా అదే క్షణంలో చల్లని రెండు చిన్నచేతులు నావంటి మీద పడ్డాయి. ఒకటి నా మెడని, రెండోది నా ముఖాన్ని మృదు వుగా నిమురుతున్నాయి. దాంతోపాటు అదుర్దాతో కూడిన సాను





భూతిసూచకస్వరం వినపడింది.

"ఏం, వంట్లో బాగుండలేదా?"

ఇంతవరకు మగజాతి నంతనూ దుమ్మెత్తిపోసి, ఆ జాతి దుంపనాశనాన్నే కోరిన నటాషా యీ ప్రశ్న వేసిందని నేను వెంటనే నమ్మలేకపోయాను. కాని, ఆమె గబగబా మాట్లాడేస్తోంది....

"ఏమిటి? ఊఁహుఁ, చలిగా వుందా? వళ్లు కొంకర్లు పోతోందా? ఓహో, బలేవాడివే! మాట్లాడకుండా .... ముంగిలా కూచున్నావేం మరి? అంత చలిగావుంటే యిందాకటినుంచీ చెప్ప కూడదుటోయ్....ఊఁ....సరే, నేలమీద పడుకో .... కాళ్లు జాపు ...నేను కూడా పడుకుంటూ వుండు....ఊఁ, అల్లాగ! నా చుట్టూ చేతులేసుకో....గట్టిగా....అదుగదీ, ఏం, యిప్పుడు కాస్త వెచ్చగా లేదూ?.... కాస్సే పిల్లావుండి, తర్వాత వీహూ వీహూ అన్చి పడు కుందాం....ఎల్లాగో ఒకలాగా రాత్రి గడిపేద్దాంలే .. తాగుడు జోరు చేశావేమిటి? ఉద్యోగం ఊడగొట్టారా? పాపం:.... పోతే పోయిందిలే! పీడ వదిలింది...."

న న్నామె ఓదార్చింది .... ధైర్యంచెప్పింది .... నా కర్మం కాలః—ఎంత చిత్రమో ఆలోచించండి! నే నప్పట్లో మానవజాతి పరమావధులను గురించి తలపట్లు పడుతున్నాను. రాజకీయ చదరంగపుటెత్తులను గూర్చి. సాంఘికవిధాన పునర్నిర్మా ణావశ్యకతను గూర్చి శ్రద్ధగా యోచిస్తున్నాను. గొప్పగొప్ప పుస్తకాలు—వాటి వాటి రచయితలకే గ్రాహ్యంకాని గూఢభావాలు గల పుస్తకాలు— చదువుతున్నాను. అప్పట్లో 'బ్రహ్మాండమైన

సాంఘిక చైతన్యశక్తి'గా తయారవడానికి కృషిచేస్తున్నాను. ఆ కృషిలో కొంతవరకు కృతకృత్యుడ నైనట్లే అనిపిస్తూండేది. నా జీవితం వృధా కాలేదనీ, జీవితంలో నే నొక చారిత్రాత్మక బాధ్యత నిర్వహించగలననీ కూడ తలపోస్తూండేవాణ్ని. అల్లాంటిది దెబ్బలు, తన్నులు తిని, అష్ట కష్టాలు పడుతూ సంఘంలో స్థానం గాని, యే మాత్రం విలువగాని లేని ఒక సామాన్య వేశ్య తన శరీరస్పర్శతో నాకు వెచ్చదనాన్ని ప్రసాదిస్తోంది. నే నామెకు సహాయం చెయ్యాలని తలపోయకముందే నా సహాయాని కామె ముందుకు వచ్చింది. ఒకవేళ నే నామెకు సహాయం చేయా లను కున్నా నిజాని కేమీ చేయలేకపోయేవాడినే.

ఛీ! ఇదంతా గాఢనిద్రలో, కలలో—అర్థంలేని పీడకలలో సంభవించిన దనిపించింది.

కాని, యేమో! పడవ చిల్లుల్లోంచి నీటిబొట్లు రాలుతున్నై. ఆయువతి వెచ్చని తనరొమ్ముల్ని గట్టిగా నా రొమ్ము కానించింది. వోడ్కా-కంపుకొడుతున్న ఆమె నిశ్వాసాలు నా ముఖంమీద వెచ్చగా తాకుతున్నాయి....నాకెంతో ... ప్రాణం లేచి వచ్చిన ట్లనిపిస్తోంది....మరి, యిదంతా కల అనుకోవడ మెట్లా? గాలి హోరున వీస్తోంది. పడవమీద వాన జోరుగా కురుస్తోంది. కెరటాలధ్వని సరేసరి. మే మిద్దరం ఒకళ్ల నొకళ్లం గట్టిగా కౌగలించుకుని పడుకున్నాం. అప్పటికీ చలితీరక వణుకుతున్నాం. ఇదంతా నిజంగా జరిగింది మాత్రమేకాదు, స్వయంగా అనుభవించినది. అసలల్లాంటి కలగనటం యెవరికీ సాధ్యం కాదనే నా నమ్మకం.

నటాషా అంతసేపూ ఎంతో మృదువుగా, సానుభూతి

పూర్వకంగా మాట్లాడుతూనే వుంది. అంత సానునయంగా మాట్లా డటం ఒక్క స్త్రీలకే సాధ్య మనుకుంటాను. అమాయకము' దయార్ద్రము నైన ఆమె మాటలతో నా హృదయంలో ఒకమూల జ్యోతి ఒకటి వెలిగి ప్రకాశించుతూన్నట్టుంది. నా మనోమాలిన్య మంతా కరగిపోయిన ట్టయింది.

నా కళ్లు బాష్పపూరితా లయ్యాయి. కన్నీరు కాల్వలుగా ప్రవహించ సాగింది. కన్నీళ్లతోపాటు గతంలో నా హృదంతరాళంలో గూడు కట్టుకునివున్న ద్వేషము, వేదన, మూర్ఖత్వము, కుళ్లు కరిగిపోయాయి....నటాషా నాలో ఉత్సాహాన్ని రేకెత్తించింది.

"ఇదుగో, అబ్బేబ్బే, ఇల్లా యేడుస్తారా? ఊరుకో! భగ వంతుడి దయవల్ల మళ్లీ యేదో ఒకపని దొరక్కుండా పోతుందా- దొరుకుతుందిలే...."

అంతసేపూ నన్నామె ముద్దులతో ముంచేస్తూనే వుంది.... ఎన్ని ముద్దులు పెట్టుకున్నదో లెక్కలేదు .... అన్నీ హృదయ పూర్వకంగా పెట్టుకున్న ముద్దులే.—

నా జీవితంలో ప్రియమైన ముద్దు లవే. అవే నా జీవితంలో లభించిన వాటిలో కల్ల అత్యుత్తమమైనవి. తర్వాత లభించినవన్నీ కలసి నాకిచ్చిన తృప్తి శూన్యమేనని చెప్పాలి. కాగా వాటికి నేను చెల్లించిన ముడుపుకూడ యేమంత స్వల్పంకాదు.

"ఓయ్, పిచ్చిబాబూ! యేడవకు. నీకు పని దొరక్కపోతే నీ పోషణ నేను చూస్తాగా..."అన్న ఆమె మాటలు నిద్రలో విన్నట్లు విన్నాను.

సూర్యోదయ మయ్యేవరకు ఒకరి కౌగిలిలో మరొకరం

సుఖంగా నిద్రించాము.

సూర్యోదయం కాగానే పడవక్రిందుగా బయటపడి పట్నం చేరుకున్నాము. అక్కడ విడిపోతూ చిరకాల మిత్రుల్లాగా పరస్పరం హృదయపూర్వకంగా సెలవు తీసుకున్నాం. తర్వాత ఆరు నెల్లపాటు అదేపనిగా వీధు లన్నీ గాలించాను గాని, పైన వర్ణించిన శరద్రాత్రినాడు నేను కలుసుకున్న కరుణామయి- ఆ నటాషాను మళ్లీ కలుసుకోలేకపోయాను.

ఆమె యింతక్రితమే చనిపోయి వుంటే— చనిపోవడమే ఆమెకు సుఖదాయకం — ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక! బ్రతికేవుంటే సుఖంగా వుండుగాక! ఆమె తరఫున నేను ప్రార్థించేదల్లా ఒక్కటేవుంది. ఆమెకు తన పతనాన్ని గూర్చిన చైతన్యం కలుగకుండా వుండాలన్నదే నా ప్రార్థన. అలాంటి చైతన్యం వల్ల ఆమె జీవితానికి ప్రయోజనం లేకపోగా వ్యర్థచింత మాత్రమే కలుగుతుంది.



(6)

# మకార్ ఛుద్ర



సముద్రం మీదుగా వీచే జలార్ద్రమైన శీతల వాయువు అలల హోరును, ఒడ్డు మీది పొటు చేసే రొదను స్టెప్పీ మైదానమంతటా వ్యాపింప చేస్తోంది. ఉండుండి వీచే పెనుగాలులు చలికి ముడుచుకుని, వంకరలు తిరిగిన పచ్చని ఆకులను చలిమంటలోకి విసురుతూ, మంటలను నలువేపులకూ చెదరకొడుతున్నాయి. ఆ శరద్రాత్రి వేళ మ మ్మావరించుకున్న పొగమంచు యీ గాలుల తాకిడికి బెదిరి చెదిరిపోతోంది. మంటల మసక వెల్తురులో యెడమప్రక్క దరిలేని మైదానము, కుడిప్రక్క అంతులేని సముద్రము, ఎట్టెదుట యాభై గజాల దూరంలోవున్న జిప్సీ దండుకు చెందిన గుర్రాలను కాపలా కాస్తూ పురాతన శిలా విగ్రహాలవలె రొమ్ము విరుచుకుని నిలబడియున్న మకార్ ఛుద్ర అనే ముసలి జిప్సీయును దృగ్గోచరమయారు.

హోరుమని వీస్తూన్న చలిగాలి ఆ ముసలి జిప్సీ వేసుకున్న కోసక్ కోటును ఎగరగొట్టి రొమ్ముకు తాకుతున్నా లెక్కచేయక ఆతను అతి ఠీవిగా నిలబడి వున్నాడు. మా చుట్టూ ఆవరించి వున్న స్టెప్పీ మైదాన మంతా అతినిరవంగా, నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ విసురుగా, విరామం లేకుండా ముసలి జిప్సీ కబుర్లు చెప్పసాగాడు.

"అయితే తిరుగుడు ప్రారంభించా వన్నమాట! ఆఁ, బాగుంది! మంచిపనే యేరుకున్నావు. బలేవాటంగా! తిరుగు, చుట్టూ అన్నీ చూడు. అన్నీ బాగా చూశాక పడుకుని, ప్రాణం వదిలెయ్యి —అంతకన్నా యేముందిలే!"

జీవితం! ఇతరులు! 'అంతకన్నా యేముం' దన్న అతని మాటమీద నేను చేసిన వ్యాఖ్యానాన్ని సంశయాత్మకంగా విని అతను మళ్లీ సాగించాడు "అయ్యో బాబు! ఆ మెట్టవేదాంతం కట్టిపెట్టబ్బాయ్! జీవితంలో నువ్వు మాత్రం ఒక భాగం కాదూ? ఇతరు లెవ్వరికీ నీజోలీ సొంఠీ అక్కర్లేదు. ఒక వేళ నువ్వు లేక పోతే వాళ్లకి గడపదని భ్రమ పడుతున్నావేమో; నువ్వు లేకపో యినా వాళ్లు బ్రతగ్గలరు. ఇంతకీ, నువ్వేమన్నా తిండివా, గుడ్డవా? ను వ్వెవరికీ అక్కర్లేదోయ్ నాయనా!

"ఏమంటావ్? నేర్చుకోడానికీ, నేర్పడానికీనా? కాని, వెయ్యిజన్మ లెత్తినా ప్రజల్ని సౌఖ్యవంతుల్ని చేసేమార్గం తెలుసుకోగలవా? ఎన్నటికీ తెలుసుకోలేవు! గడ్డం, మీసం నెరిశాక యేమన్నా నేర్పగలవేమో. అయినా ఒకరు నేర్పే దేమిటి? తన కేమి కావాలో ప్రతివాడికీ తెలుసు. మనుషుల్లో కొందరు తెలివైన వాళ్లూ, కొందరు మందబుద్ధులూ వుంటారు. తెలివైన వాళ్లు చిక్కి నంతవరకు జాగ్రత్త చేసుకుంటారు. మందబుద్ధులకు మిగిలేది మన్నే. ప్రతివాడూ తననుంచి తనే నేర్చుకుంటాడు....

"ప్రజలు బలే చిత్రమైన మనుషులు. ఈ భూలోకంలో యింతంత విశాలమైన ఖాళీ ప్రదేశాలుంచే—" అతను మైదానం కేసి చూపుతూ చెప్పాడు—"మీ వాళ్లు గుంపులుగా చేరి ఒకళ్ల

నెత్తిమీద మరొకళ్లు నివసిస్తారు. ప్రతివాడూ పనిచేస్తాడు; ఎందుకు? ఎవరికోసం? ఏమో, ఎవరికీ తెలియదు. భూమిని దున్ని సాగు చేసే రైతును చూస్తావు. అబ్బ, యెంతశ్రమ పడుతున్నాడు. చెమట రూపంలో శరీరంలోని రక్తం ఓడుస్తున్నాడే. చివరకు యీ మట్టిలోనే కలిసి నశించిపోతాడుకదా అనుకుంటావు. తర్వాత యేముంది? ఏమీలేదు. ఏ భూమినైతే అతను శ్రమపడి సాగు చేశాడో ఆ భూమిలో పండిన ఫలసాయ మేమీ అతని కంటబడదు. వేసిన గొంగళి వేసిన చోట వేసినట్టే వుంటుంది.

"ఏమయ్యా, అందుకేనా అతను పుట్టింది? జీవితకాల మంతా మట్టికెలికి స్వంతానికి చివర కొరక చిన్న సమాధినైనా తవ్వుకోలేక చనిపోయేందుకేనా అతను పుట్టింది? అతనికి స్వతంత్ర మంటే యేమిటో తెలుసా? ఈ స్టెప్పీ వైశాల్యం అతని ఊహ కందుతుందా? సముద్రఘోష విని అతని హృదయం ఆనంద పుల కిత మవుతుందా? అయ్యో దేవ! వా డొక బానిస — అంతే. బానిసగా పుట్టాడు; బ్రతికిందీ బానిసగానే. అంతే! అతని వల్ల యేమవుతుంది? అత నేం చెయ్యగలడు? కాస్త తెలివికలవాడైతే చేరువనేవున్న చెట్టుకు ఉరితీసుకోవడం తప్ప!

"తెలుసా? నా కిప్పుడు యాభై ఎనిమి దేళ్లు. ఈ యాభై ఎనిమిదేళ్లలోనూ యెన్నో విషయాలు చూశాను. లవన్నీ కనుక పుస్తకాల మీద కెక్కిస్తే బండెడు పుస్తకా లవుతాయి. నేను దాటని సరిహద్దు లేమున్నై! చెప్పటం కష్టమే. నేను చూసిన కొన్ని ప్రదేశాలు నీ ఊహకూడా అందవు. బ్రతికితే అట్లా బ్రతకాలి; వెళ్లు, ముందుకుపో—అంతే. ఒకేచోట ఎక్కువ

దినాలు వుండొద్దు. అలా వుంటే మజా ఏముంటుంది? రాత్రిం బగళ్లు యే విధంగా ఒకదాని వెంబ మరొకటి తరుముకుంటూ భూమిచుట్టూ తిరుగుతాయో చూడు. అదే విధంగా జీవితాన్ని ప్రేమించ గలిగేందుకుగాను బ్రతుకును గూర్చిన తలంపునుండి పరుగెత్తు. ఎప్పుడైతే జీవితాన్ని గూర్చిన తలపులు నీ మనస్సులో ప్రవేశించాయో అప్పు డిక జీవితంమీద నీ కున్న ప్రేమ, మమ తలు నశించిపోయి రోతమాత్రం మిగులుతుంది. అదెప్పుడూ అంతే ననుకో. నా విషయంలో కూడా అదే జరిగింది. నేను చెప్పేది నిజమే బాబూ!

"అప్పుడు నేను గాలిచిన్ జైల్లో ఖైదీగా వున్నాను. ఒక రోజున విసుగెత్తి ఆలోచించడం మొదలు పెట్టాను. ప్రపంచంలో నే నెందుకోసం జీవిస్తున్నానా అనే భావం నా మనసును కలచి వేయ సాగింది. నా హృదయం అడకత్తెరలోని వక్కలా అయిపో యింది. తా నెందుకోసం జీవిస్తున్నాడో యెవడు చెప్పగలడు. మెడమీద తలవున్న వా డెవ్వడూ చెప్పలేడు. అంచేతే, ఆవిష యం యెప్పుడూ, యెవ్వరూ ఆలోచించకూడదు. జీవించు, అంతే. చుట్టూ చూస్తూ తిరుగు. నీ మన స్సెప్పుడూ ఆరాటానికి లోను కాదు. నా ఆలోచనతో నా కప్పుడు దాదాపు ఉరి తీసుకున్నంత పనైంది తెలుసా!

"బలే! ఒకసారి మీ ప్రాంతపువాడు—రష్యనే అయ్యుం టాడు—ఒకడితో మాట్లాడాను. 'ఎవడి చిత్తానుసారం వాడు బ్రతక్కూడదు: దేవుని ఆదేశానుసారంగా బ్రతకాలి' అన్నా డతను. మనసారా భగవంతుణ్ణి ప్రార్థిస్తే నీకు కావలసినవన్నీ

భగవంతుడే యిస్తాడని చెప్పాడు. పరీక్షగా చూస్తినికదా అతని బట్టలన్నీ చింకి పాతలే. ఎక్కడ చూసినా మాసికలే. 'మరి — ఒక జత కొత్తబట్ట లిమ్మని భగవంతుణ్ణి ప్రార్థించకపోయావు టయ్యా' అన్నాను. ఆ మాటతో చూసుకో, అతను అగ్గయి పోయి కొట్టొంచినంత పనిచేశాడు. అంతకు ఒక క్షణం క్రితమే అత నేం చెప్పాడో తెలుసా? తప్పుచేసిన వాడిని మన్నించి, ప్రేమిం చాలని చెప్పాడు. మరి, ఒకవేళ నామాటలు అతనికి కోపాన్ని కలి గించాయే అనుకో- అయినా పైనచెప్పినట్టు న న్నతను క్షమించి వుండాల్సిందికదా? పెద్ద భక్తుడు, బోధకుడూ చూట్టానికి మళ్లీను. ప్రజలు మితంగా భోంచెయ్యాలని బోధిస్తారు. కాని, తాము మాత్రం రోజుకు పదిసార్లు పొట్టలు చెక్కలయ్యేట్లు మెక్కుతారు."

అతను చలిమంట మీద తుపుక్కున ఉమ్మేసి, పైపులో పొగాకు వేసుకుంటూ కొంతసేపు మౌనందాల్చాడు. గాలి విల పిస్తూన్నట్లు రొదచేస్తూ వీస్తోంది. పొగమంచులోవున్న గుర్రాలు సకిలిస్తున్నాయి. డేరాలోనుంచి మకార్ కూతురు - నోంకా ఆలో చనా వ్యథిత మధుర గానం వినపస్తోంది. నోంకా బలే అందమైన పిల్ల. పాట పాడినా, మాటలాడినా ఆమెస్వరంలో యేదో తీరని వ్యథ తొంగిచూస్తుంటుంది. ఆమె అందం చూపరులను వివశుల్ని చేస్తుంది.

మకార్ ఒకపైపు నా కందించాడు.

"కాల్చు! ఏం, పిల్ల బాగా పాడుతోందా? అల్లాంటి పిల్ల దొరికితే పెళ్లి చేసుకుంటావా? చేసుకోవూ? అదు గదీ! అల్లా గుండాలి కుర్రా డంటే. ఆడపిల్ల లెప్పుడూ నమ్మొద్దు.

నమ్మకపోవటమేకాదు, వాళ్లకి సాధ్యమైనంత దూరంగా వుండు. పైపు కాలిస్తే మనిషి కెంత హాయి కలుగుతుందో, ఆడది ముద్దె పెట్టుకుంటే అంతకన్నా అనేక రెట్లు హాయికలుగుతుంది. కాని, ముద్దు పెట్టుకోనిచ్చావా, మరుక్షణంలోనే నీ హృదయం ఆమె పాదాక్రాంతమై పోతుంది. అదేం చిత్రమో, ఏ అదృశ్య బంధ నాలతో బంధిస్తుందోగాని, ఆ బంధనాలు మరి తెగవు. నీ ఆత్మను సైతం ఆమె కర్పించివేస్తావు. నీకు మిగిలే దింకేముంది? అంచేత నాయనా!-ఆడపిల్లల ఛాయలకైనా పోకు. బహుపరాక్ ! వాళ్లి చెప్పేవన్నీ పచ్చి అబద్ధాలు. విషకీటకాలు. ప్రపంచంలో అన్నిటి కన్న మిన్నగా నిన్నే ప్రేమిస్తున్నా మంటారు. ఎందుకు? చిన్న పిన్నీసుతో గుచ్చి. యిక చూసుకో వాళ్లుచేసే రభస! ఆప్రేమ అంతా యేమవుతుందోగాని, నిస్నుపీకి పిండేస్తారు. నాకు తెలుసుగా· అయ్యోదేవ, బాగాతెలుసు! ఏం అబ్బాయ్! జరిగిన కథ ఒకటి చెప్పమన్నావా? ఆకథ మరచిపోవద్దుసుమా! దాన్ని మరచిపో నంతకాలం ఆకాశంలో యెగిరే పక్షిలాగా నువ్వు కూడ జీవిత మంతా స్వతంత్రంగా గడుపుతావు.

"పూర్వం జోబార్ అనే జిప్సీ యువకు డొక డుండేవాడు-లాయికో జోబార్. అతను బహు సాహసి. హంగరీ, బొహీమి యాల్లోనేకాక స్లావోనియాలోకూడ అతనిపేరు తెలియనివారు బహు అరుదు. ఆ దేశా లన్నింటిలోనూ జోబార్‌ను హత్య చేస్తామని యెందరో ప్రతిజ్ఞలు పలికారు; కాని, ఆపని ఒక్కడికీ సాధ్యం కాకపోయింది. తన కంటికి నచ్చిన గుర్రం వుందంటే పెద్ద దండు కాపలా కాస్తున్నా దాన్ని పుడాయించుకెళ్ళి స్వారీ

చేశాడన్నమాటే! ఎజ్బే! నరుడన్నవాడికి భయపడ్డాడా! మృత్యు దేవతే తన కింకరులతో దండెత్తి వచ్చినా, అతను కత్తి తీసి కన్నున పొడవటానికి వెనుతీసేవాడు కాదు. కనీసం బండ బూతులు తిట్టి, నాలుగు తన్ని తగిలేసేవాడు.

"అతని సంగతి జిప్సీ గుంపు లన్నిటికీ ఆకరమే. కనీసం అతని పేరైనా విని వుంటారు. జోబార్‌కి గుర్రా లంటే అమిత మైన ప్రేమ. ప్రపంచంలో అతను గుర్రాలను ప్రేమించినంతగా మరి దేన్నీ ప్రేమించలా. కాని ఆ ప్రేమ నిలకడగా వుండేది కాదు. నచ్చిన గుర్రంమీద నాలుగు రోజులు స్వారీ చేసేదీ, తర్వాత దాన్ని అయినకాడికి అమ్మేసి మరొకదాన్ని సంపాదించే దీను. డబ్బంటేనేకాదు, అతనికి యేదన్నా లక్ష్యంలేదు. ఆఖరికి తన గుండెకాయ కావాలన్నా - అది యితరుల కేమాత్రం ఉప యోగిస్తుందన్నా - స్వయంగా పెరికి యిచ్చే తత్వం అతనిది.

"ఇప్పటికి పదేళ్ల క్రితం సంగతి. మా గుంపు బుకోవినా ప్రాంతంలో తిరుగాడుతోంది. అది వసంతఋతు వనుకుంటాను. ఒక రాత్రి నేను, కోషత్ సైన్యంలో పనిచేసిన దానిలా యోధుడు, ముసలినూర్, యింకా మిగతావాళ్లు, దానిలా కూతురు- రాద్దా అంతా దేరాముందు కూర్చున్నాం.

"మా నోంకా నెరుగుదువుగా ? అందాల భరిణ! కాని, ఆమెకూ రాద్దాకూ సహస్రం వారవుంది. ఆ రాద్దా వుండే-ఆమెను గురించి పొడిమాటల్లో చెప్పటం సాధ్యం కాదనుకో. ఏ ఫిడేలు స్వరాల సాధనంతోనైనా గ్రహించవచ్చునేమో; అంతే —పైగా ఆ హాయిద్యంలోని మెళకువ లన్నీ తెలిసినవాడే దాన్ని

వాయించాలి.

"రాద్దా ఎంతమంది యువకుల హృదయాల్లో చిచ్చు పెట్టిందో లెక్కలేదు. మొరేవియాలో ఒక పెద్ద షావుకారు గుర్రంమీద పోతూ ఆమెను చూసి అలాగే స్తంభించి పోయాడు. గుర్రంమీద కూర్చుని గ్రుడ్లప్పగించి ఒళ్లంతా కళ్లుచేసుకుని రాద్దావంక చూశాడు. అతని శరీరమంతా చలిజ్వరం వచ్చినవాడి దేహంలాగా కంపించసాగింది. అతనూ అందగాడే. గిరజాలు తిరిగిన జుట్టు. బంగారు గుండీలున్న ఉక్రేనియను కోటు. తళుక్కుమని మెరిసే రత్నాలు పొదిగిన కత్తి.....అతని నీలం మొఖమల్ టోపీ నీలమేఘపు తునకలా గుంది. మొత్తంమీద ముసిలాడైనా చాలా అందగాడని చెప్పొచ్చు. చూసి చూసి, అతను రాద్దాతో 'ఏయ్ పిల్లా! ఒక్క ముద్దిస్తావూ, కోరినంత డబ్బిస్తాను.' అన్నాడు. కాని, ముఖం పక్కకు తిప్పేసుకుందామె: 'పిల్లా! నీ మనస్సుకు కష్టం కలిగించితే క్షమించు. పోనీ, నావేపు ఒక్కసారి ప్రేమగానైనా చూడు. అంతేచాలు' మందస్వరంతో అని, పర్సుతీసి ఆమె కాళ్లముందు గిరాటేశాడు. పర్సులో డబ్బు దిట్టంగా వుందిసుమా తమ్ముడూ! యాదాలాపంగా చూసీ చూడ నట్టుగా దాన్నామె తన్నిపారేసింది.

"ఓహో, ఏం పిల్ల! అతను నిట్టూర్చి, గుర్రాన్ని అదలించు కుని ముందుకు సాగిపోయాడు.

"మళ్ళీ మరునాడే అతను మా డేరాకి వచ్చాడు. 'పిల్ల తండ్రి ఎవ'రన్న అతని ప్రశ్నతో గుడారం మార్మోగింది. దానిలా లేచి వెళ్ళాడు. 'నీకు కావలసినంత సొమ్ము తీసుకుని

నీ కూతురును నా కమ్మెయ్యి' అన్న ఆ షావుకారుతో దానిలా యేం చెప్పాదో తెలుసా? 'పశువులతో ప్రారంభించి ఆఖరికి ఆత్మల వరకు అమ్ముకోటం ప్రభువులకే చెల్లింది! కోసక్ సైన్యంలో పని చేసినవాణ్ణి. ఈ చ్చుల్లిపాయ లమ్ముకునే షావుకార్ని కాదు నేను!' దానితో పెద్ద గంద్రగోళమైంది. షావుకారు కత్తి దుయ్యబోయాడు. ఇంతలో మాలో ఒకడు గుర్రం చెవిలో చురక అంటించాడు. అంత టది దౌడు లంకించుకుని అతన్ని తీసుకు పోయింది. మేము డేరా యెత్తేసి మరో చోటుకు బయల్దేరాం. రెండు రోజులు ప్రయాణం చేశాము. అతనూ మమ్మల్ని వెంబడించాడు! 'ఇదుగో, నా కేమీ దురుద్దేశం లేదు: ఆ పిల్లను యథావిధిగా పెళ్లి చేసుకుంటాను. కొల్లలుగా వున్న నా ధనమంతా తెచ్చి మీకు పంచిపెడతాను' అంటూన్న షావుకారు జీనుమీద ఊగిపోతున్నాడు.

'ఏమంటా వమ్మాయ్! నీ అభిప్రాయం చెప్పు' దానిలా మెల్లిగా గొణిగాడు.

'తనంతట తానే పోయి రాణీగద్దె కాకి గూట్లో కాపురం పెడితే యేంజరుగుతుంది?' రాద్దా యెదురు ప్రశ్నించింది.

"దానిలా. అతనితోపాటు మేమూ కడు పుబ్బేట్లా నవ్వుకున్నాం.

"సెభాష్. పిల్లా! ఏమయ్యా. విన్నావుగా? అప్పే. యేం లాభంలేదు! పోయి పెంపుడు పిట్టని వెతుక్కో — చెప్పినమాట వింటుంది.' అని దానిలా చెప్పిన తర్వాత మేము ముందుకు సాగిపోయాం.

"కాని, ఆ పిరుదు ముఖమల్ టోపీని తీసి నేలకేసి కొట్టి పిచ్చెత్తినవాడిలా అదేపోత పోయాడు. రాద్దా యెటువంటిదో కొంచెమన్నా తెలిపింపా అబ్బీ!

"ఏం, తర్వాత ఒకరాత్రి మేమంతా భోజనాలు చేసి కూర్చున్నాం. స్టెప్పీలమీద నుంచి ఆ పాత మధురమైన సంగీతం తేలివచ్చి మమ్మల్ని స్వర్గసీమల్లోకి తేల్చివేసింది. మేము మైమరచిపోయాం. ఏవో దివ్యానుభూతులు మమ్మల్ని ఆవరించాయి. ఆ అనుభూతుల అనంతరం మరి జీవించటం అనవసర మనిపించింది.

"బ్రతికితే ప్రపంచంలో విజేతల్లా తలెత్తుకునే జీవించవచ్చు ననిపించింది.

"ఆస్వరం అంతకంతకు మమ్మల్ని సమీపించ సాగింది. అంతలోనే చీకట్లోనుంచి ఒక గుర్రం కానవచ్చింది. దానిపై వస్తూనే ఒకవ్యక్తి ఫిడేలు వాయిస్తున్నాడు. చలిమంట దగ్గరకు రాగానే వాయిద్యం ఆపి మా వంక చూచి మందహాసం చేశాడు.

"ఓహో! జోహార్, సువ్వా!" సంతోషంగా పలకరించాడు దానిలా.

"అతని మీసాలు తుమ్మెద రెక్కల్లాంటి నల్లని భుజాల పైకి వ్రేలాడుతున్నాయి. అతనికళ్లు నక్షత్రాలవలె మెరుస్తున్నాయి. అతను నవ్వుతూంటే సూర్యుని కిరణాలు ప్రసరించినట్లుంది! అతని గుర్రమూ, అతనూ కూడ పోతపోసిన ఉక్కు విగ్రహాల్లాగా వున్నారు. చలిమంటల ఎర్రని కాంతిలో అతను రక్తంలో జలకమాడినట్లు కన్పించాడు. నవ్వినప్పుడల్లా అతని పలువరుస

జిగేల్‌మని మెరిసేది. . ఓహ్! యింకా అతను నాతో ఒక్క మాటైనా మాట్లాడకముందే, అసలు ప్రపంచంలో నే నంటూ ఒక వ్యక్తిని వున్నాననే విషయమైనా అతను గుర్తించకముందే. అత నంటే నాకు గాఢమైన ప్రేమాభిమానాలు కలిగాయి!

"బిడ్డా! ప్రపంచంలో యెల్లాంటి వ్యక్తులుంటారో చూశావా? అతను నీ కళ్లల్లోకి చూసినంతమాత్రాన నీ ఆత్మ అతనికి దాసోహమంటుంది. అయితేనేం, అంతమాత్రాన నువ్వు సిగ్గుపడాల్సిన పనిలేదు సరికదా ఒకవింత గర్వం కలుగుతుంది. అల్లాంటి వ్యక్తి సమక్షంలో వున్నంతమాత్రాన మనలో ఔన్నత్యం వృద్ధి చెందుతుంది. అటువంటి వ్యక్తి లీ ప్రపంచంలో బహు అరుదుగా వుంటారు బిడ్డా! సరే, ఉన్నవారే పదివేలు. అంతా మంచివాళ్లే అయితే యిక మంచిని గుర్తించే వాళ్లే వుండరు. అది సరేలే: ముందు కథ విను.

"రాద్దా అడిగింది కదా—'నువ్వు ఫిడేలు బాగా వాయిస్తావు లాయికో! అంతచక్కని స్వరయుక్తమైన ఫిడేలు నీ కెవరు చేసి పెట్టారు?' అతను మందహాసం చేశాడు. 'నేనే స్వయంగా తయారుచేశాను! కర్రతోకాదు, ప్రేమించిన యువతి యెదతో చేశాను. ప్రేమపూరితమైన ఆమె హృదయతంత్రుల్ని తీసి దీని కమర్చాను. స్వాభావికంగా నా ఫిడేలు పలకదు. కానైతే దీనిమా నెట్లా పట్టుకోవాలో నాకు బాగా తెలుసు! విన్నావా?' అన్నాడు,

"ఆడదాని కళ్లు మహా నిశితమై, మగవారి హృదయాల్లో చిచ్చు రగుల్చుతాయనీ, కనుక మగవాడు ముందుగా వాటిని చెమరింపజేసి వాటి తీవ్రతను మందగింప చెయ్యాలనీ పెద్దలు చెప్త

తారు. సరిగా ఆపనికే పూనుకున్నాడు లాయికో. కాని, రాద్దా వద్దనేనా యీ పప్పు లుడికేది? రాద్దా ప్రక్కకు తిరిగి ఆవులిస్తూ 'ఏమిటో, జోబా రేకో పెద్ద తెలివైనవా డనీ, నేర్పరనీ అంటూం టారే—ఓస్, యింతేనా? ఒట్టి డాబులేనన్నమాట' అని లేచి పక్కాపోయింది.

"ఓహో! అంవాలరాణి నోరు మహా చెడ్డది! లాయికో కళ్లు జిగేలుమన్నై. ఒక్క ఉరుకున క్రిందకు దిగి 'అన్నలారా! వంద నాలు! మీకు అతిధిగా వచ్చా' నన్నాడు.

"వీరుడా, సుస్వాగతం!" దానిలా స్వాగతం చెప్పాడు. అతని నొసట ముద్దు పెట్టుకుని, పిచ్చాపాటీ చెప్పుకుంటూ నిద్ర పోయాం. మేము గాఢనిద్రపోయాం. ఉదయాన్నే లేచి చూసే పరికి జోబార్ తలకి కట్టువుంది. చిత్రంగా వుందే, గాయ మెట్లా తగిలిం దబ్బా? గుర్రం తన గిట్టతో నిద్రపోతూన్న యజమానిని గాయపరచి వుంటుందా?

"అహ్హా,హ్హా! ఆ గుర్ర మేదో మేము గ్రహించాం. దానిలా మందహాసం చేశాడు. ఇంతా చేసి రాద్దాకి లాయికో తగిన వరుడు కాదేమో? అబ్బే, అల్లా అనుకోటానికి వీల్లేదు! ఎంత అంద గత్తైనా కానివ్వండి: స్త్రీ హృదయం బహుకుంచితం; ఆమె మెడచుట్టూ బంగారం దిగెయ్యొచ్చు; అంతమాత్రాన ఆమె విలువ పెరుగదు. అది సరేలే!

"అక్కడే చాలా రోజులు గడిపాము. జోబార్ కూడ మాతోనే వున్నాడు. జోబార్ యెంత ప్రేమ పాత్రుడు! తెలివిలో తలనెరిసినవాళ్లు కూడా అతనిముందు దిగదుడుపే. ఏ పనైనా

అవలీలగా చేసేవాడు. రష్యన్, హంగ్రీ భాషల్లో వ్రాయడం చదవడం క్షుణ్ణంగావచ్చు. ఎంత చక్కగా మాట్లాడే వాడని! అతని మాటలు వింటూ నిద్రాహారాలు లేకుండా, యేళ్లూ, పూళ్లూ గడిపెయ్యొచ్చు. అబ్బ, జోబార్ ఫడేలు వాయించేవా డబ్బాయ్! రాళ్లు కరిగేవంటే నమ్ము. ఫిడేలువాద్యంలో అతన్ని మించేవాడు ప్రపంచం మొత్తంమీదనే లేడంటే అతిశయోక్తి కాదేమో! తీగలమీద అతని కమాను కదులుతూంటే ఒకప్పుడు శ్రోతల హృదయాలు గంతులేసేవి. వేరొకప్పుడు స్పందించటం మాని స్తంభించిపోయేవి. అతనిపాట వింటూంటే ఒకేసారి నవ్వూ, ఏడుపూకూడ వచ్చేవి. వేరొకప్పుడు మానవ విలాపం వినవచ్చి మనసును కలచివేసేది. మరోసారి ప్రియుని చెట్టా పట్టాలు వేసుకుని ఉత్సాహంగా కేరింపుయకొట్టే యువతి స్వరం వినవచ్చేది. అంతలో ఆ యువకుడు ప్రేయసిని సైప్పిలపై సమా గమానికి ఆహ్వానించిన ట్లనిపించేది! ఆవిధంగా గంభీరంగా అతిమధురమైన పాట దొర్లిపోయేది. పాట ప్రభావంతో జాజ్వల్య మానంగా ప్రకాశించే సూర్యుడు నాట్యం చేస్తూన్నట్లు కనిపించేది! చిత్రంగా లేదూ?

"నీలోని ప్రతి రక్తనాళమూ ఆ పాటను అర్థం చేసుకుం టుంది, ఆస్వాదిస్తుంది; దాసోహ మంటుంది. అప్పుడు లాయికో యెవరినైనా నరికి రమ్మని ఆజ్ఞాపించినా, ఎవరి నన్న విచక్షణ లేకుండానే నరికి వచ్చేవాళ్లమే! ప్రతి మనిషిని అత నంతగా ఆకర్షించేవాడు. మాలో ప్రతి ఒక్కడూ అతన్ని గాఢంగా ప్రేమించేవాడు. ఒక్క రాడ్డా మాత్రం అతనివంక కన్నెత్తి

చూసేది కాదు సరికదా, ఊరుకోక వెక్కిరించేది. ఆమె జోబార్ హృదయాన్ని పూర్తిగా వశం చేసుకుంది. మీసాలు మెలిపెడుతూ లాయికో పళ్ళు పటపట నూరేవాడు. అతని కళ్ళలో అగాధపు లోతులు కనిపించేవి. కాలం గడచినకొద్దీ అతని చూపులు తీక్ష్ణం కాసాగాయి. ఆ చూపులు చూస్తే ఒళ్లు జలదరించేటంత జాజ్వల్యమానంగా వుండేవి. రాత్రి వేళల్లో లాయికో యోధుడు స్టెప్పీమీద దూర దూరంగా పోయేవాడు. అతని ఫిడేలు విరహ గీతాలాపన చేస్తూ జోబార్ స్వేచ్ఛను దూరసీమలకు తరిమివేసేది. మేం మా పాట విని యేం చెయ్యాలా అని తలపోసేవాళ్ళం. రెండు బండలు ఢీకొంటే కలిగే ఫలితం రెండూ పిండి కావటం తప్ప మరేమీ కాదని మాకు తెలుసు. వాటి మధ్య మిగిలేదేమీ వుండదు. చివరికి జరిగింది కూడా అదే.

"ఒకప్పుడు మే మంతా కూర్చుని పిచ్చాపాటీ చెప్పుకుంటున్నాం. చివరికి విసుగెత్తి దానిలా అన్నాడు: 'జోబార్! ఒక చిన్న పాట పాడు!' సమీపంలోనే ఆకాశంకేసి చూస్తూ పడుకుని వున్న రాడ్దా వంక ఒకసారి చూచి, జోబార్ వాయిద్యం ప్రారంభించాడు. ఆనాటి వాయిద్యం యువతీ హృదయం పలికినట్లే వుందంటే నమ్మ! లాయికో యిలా పాడాడు —

"నా హృదిలో జ్వాలలు రేగ
నా హయమే రయమున సేగ
నా హస్తమె శస్త్రము కాగ
నే నరిగెద భువిపై, దివిపై!"

"రాడ్దా ప్రక్కకు తిరిగి, కొద్దిగా తల పైకెత్తి గాయకుని

కళ్ళల్లోకి పరీక్షగా చూసి యెగతాళిగా నవ్వింది. అతను నడిమింటి సూర్యునిలా భగ భగ లాడిపోయాడు.

" సహచరీ అరుగుము రయముగ
చక చక టక టక ముందుకు ముందుకు
మైదానం మంచుమయం, ఐతేనేం
త్వరలోనే ఉషోదయం !

" ఆకాశపు టంచులమీద
రే రాణితో భేటీ వేద్దాం
కానైతే ముసరకు సుమ్మీ
నీ జాలుతో రాణిని పాపం !

"ఎంత బాగా పాడాడు! అంత చక్కగా ఇంకెవ్వరూ పాడలేరు! కాని రాద్దా మాత్రం జుగుప్సతో 'లాయికో! అంత మరీ యెత్తు కెగరటం మంచిదికాదు సుమా! తల్లక్రిందులుగా పడ్డా వంటే ముక్కు చితకటం, మీసాలు రక్తంలో మునగటం జర గొచ్చు' నన్నది.

లాయికో ఆమెపంక క్రూరమృగంవలె చురచుర చూశా డు. కాని అంతలోనే తమాయించుకుని, జవా బివ్వకుండానే మళ్ళీ పాట సాగించాడు :

" అంతలోన ఉషోదయం కాగా
నీతో నేను నిదురేపోగా
నీవూ నేనూ మునిగేపోమా
సిగ్గు దొంతరల కాసారంలో ! "

"ఐలే పాట" అన్నాడు దానిలా – ఇంత మంచిపాట నే

నెప్పుడూ వినలేదు. ముసలి నూర్ మీసాలు మెలిపెట్టి భుజా లెగరేశాడు. జోబార్ గీతం మమ్మ ల్నందర్నీ పరవశుల్ని చేసింది. ఒక్క రాద్దాకుమాత్రం యెక్కడా నచ్చినట్టు కనపడలా. 'పూర్వం ఒకసారి యిల్లాగే ఒక యీగ రాణిగ్రద్ద కూతను అనుకరించబోయి జుమ్మని ముసిరిందిట' అంది రాద్దా. మా ఉత్సాహంమీద చన్నీళ్ళు జల్లిన ట్లయింది.

"ఏం. తస్నులు కావాలేమిటి రాద్దా? — అని దానిలా చెయ్యెత్తాడు. కాని యింతలోనే జోబార్ అడ్డువెళ్లి, కళావిహీనమైన మొహంతో అన్నాడు—

"ఆగు. దానిలా! గుర్రం పెంకె దైనప్పుడు కళ్లెం గట్టిది వాడా లన్నారు. నీ కూతుర్ని నాకిచ్చి పెళ్లిచెయ్యి.

"బలేమాట చెప్పావు!" — దానిలా మందహాసం చేస్తూ 'సరే, అంత కోరికగావుంటే చేతనైతే చేసుకో' అన్నాడు.

"సరే!' నని లాయికో రాద్దా వంక తిరిగి 'సరే, పిల్లా! ఒక్క నిముషం నీ గర్వాన్ని ప్రక్కకు నెట్టి నేను చెప్పేది విను. మీ ఆడాళ్లని చాలామందినే చూశాను..కాని అందులో ఒక్కళ్లూ నీ అంతగా నాహృదయాన్ని ఆకర్షించలా. ఇన్ని మాట లెందుకు రాద్దా! నువ్వు నా ఆత్మని బధించేశావు. సరే. దానికేంలే! కాను న్నది కాకమానదు....ఇంతకీ, మనసు నుంచి దూరంగా పారి పోవాలంటే సాధ్యం కాదుకదా. దైవ సాక్షిగా నా గౌరవం సాక్షిగా, నీ తండ్రి సాక్షిగా, యిక్కడున్న వీరందరి సాక్షిగా నిన్ను పెళ్లిచేసుకుంటాను: కాని. విను పిల్లా! నా మాటకి యెదురు చెప్పటం మాత్రం నేను సహించను. నేనింకా స్వేచ్ఛాజీవినే.

నా యిష్టంవచ్చినట్లే బ్రతుకుతాను!' అంటూనే అత నామె వైపుకు వెళ్లాడు. అతని కళ్లు నిప్పురవ్వలు చెరుగుతున్నాయి: పళ్లు పటపట లాడుతున్నాయి. అతను రాద్దావేపు తనచేతినిచాపాడు. అడవి గుర్రానికే కళ్లెం తగిలించిందిరా రాద్దా అనుకున్నాం! అంతలోనే అతను చిత్రంగా నేలమీద కొరిగిపోయాడు.

"ఇదేంచిత్రం? తుపాకిగుండు దూసుకుపోయిందా అనిపించింది. కాని, కమ్చీని అతని కాళ్లపైకి విసరి, పట్టి లాగి పడ కొట్టింది రాద్దా! అందువల్లే పట్టికొట్టాడు లాయికో.

"రాద్దా మాత్రం యధాతధంగా పడుకుని ముసిముసి నవ్వులు నవ్వుకుంటోంది. ఏమవుతుందోనని మేమందరం భీతి చెందాం. కాని, తలపగిలి పోతోందా అన్నట్టు తన తలను గట్టిగా అదిమి పట్టుకుని ఒక్క నిముషం కూర్చుని యెవ్వరివంకా కన్నెత్తి చూడకుండా నిశ్శబ్దంగా స్టెప్పీమీదకు వెళ్లిపోయాడు లాయికో. నూర్ నా చెవిలో చెప్పాడు: వెళ్లి అతన్ని కనిపెట్టి చూడు అని. రాత్రి చీకట్లో అలికిడి చెయ్యకుండా నేను జోబార్‌ను వెంబడించాను. చూశావా బిడ్డా, అదీ సంగతి!''

మకార్ తన పైపులోని మసిని దులిపేసి, మళ్లీ అందులో పొగాకు కూరసాగాడు. నా కోసక్ కోటును మరింత బిగించి పడుకుని, గాలికీ, ఎండకూ నల్లబడ్డ అతని ముసలి ముఖాన్ని పరీక్షించ సాగాను. తల పకించి తనలో తా నేదో గొణుక్కున్నాడు. దుబ్బులాంటి అతని నెరసిన మీసాలు ఊగులాడాయి. అతని జుట్టు గాలికి చిందర వందరగా యెగురుతోంది. పిడుగు పాటుకు సగం తగులబడిన మహావృక్షంవలె అత నింకా చాల

చలంగా, హుందాగానే వున్నాడు. సముద్రం అవిరామంగా హోరు పెడుతోంది. గాలి ఆ హోరును సైప్పీ పైకి మోసుకెళ్తోంది. కొంతా సంగీతం కట్టిపెట్టి చాలా సేపైంది. మేఘావృతమై యున్న ఆ శరద్రాత్రి మరింత అంధకారంగా, భయంకరంగా వుంది.

"వంచిన తల యెత్తకుండా, అడుగులో అడుగేసుకుంటూ కోయ వెంబడే నడచి వెళ్లి సెలయేటి ఒడ్డున ఒక రాతిబండమీద చతికిలబడి నిట్టూర్చాడు. గాఢమైన ఆ నిట్టూర్పు నాలో అమిత మైనజాలిని రేకెత్తించింది. వెళ్లి ఓదార్చుదామనుకునికూడా వెళ్లలా. ఓదార్చినంత మాత్రాన బాధ తీరుతుందా పిచ్చిగాని; యేమంటావ్? సరే! అత నల్లాగా ఒకటి, రెండు, మూడుగంటలు శిలాప్రతిమలా అక్కడే కూర్చుండి పోయాడు.

"నేను దావులోనే వున్నా. చంద్రోదయమైంది. శరత్కాల చంద్రిక పుచ్చపువ్వులు విచ్చిన ట్టుంది. దూరపు వస్తువులుకూడ చక్కగా కనబడుతున్నాయి.

"అంతలో అకస్మాత్తుగా దేరామందిరి రాద్దా బయల్దేరి త్వర త్వరగా రావడం గమనించాను.

"నా మనస్సు సంతోషంతో గంతులేసింది. ఓహో! బలే!- అనుకున్నాను—రాద్దా యెంత సాహసికురాలు! ఆమె తిన్నగా అతనిపద్దకే వెళ్లింది. కాని, అతను గుర్తించినట్టులేదు. అతని భుజంమీద చెయ్యేసింది. లాయికో శరీరం కంపించింది. కాళ్లకు పెనవేసిన చేతులువిడిచి తల పైకెత్తాడు. అబ్బ! పిల్లను కండలు కండలుగా కోసేస్తాడు గాబోలు! ఎల్లాగ? ఎల్లా గేమిటి, బిగ్గరగా

అరవాలి; పరుగెత్తి పదిమందినీ పిలవా లనుకున్నాను. అంతలోనే వారి మాటలు వినవచ్చాయి:

'దింపు. చెయ్యి దింపు. దింపకపోతివా నీ తల చితై పోతుంది!' రాద్దా చేతిలో పిస్తోలు తళతళ మెరుస్తోంది. దా న్నామె జోబార్ నొసటికి గురిపెట్టింది. ఇది పిల్లకాదురా పిశాచ మను కున్నాను! సరే. సమాన ఉజ్జీలు. తర్వాత యేం జరిగిందను కున్నావ్?

''విను!—పిస్తోలు మొల్లో దోపుకుని రాద్దా జోబార్‌తో అన్నది. 'నిన్ను చంపడానికి క్కాదు నేను వచ్చింది. నీతో సంధి చేసుకోడానికి. పారెయ్యి ముందా చాకును!' అనగా చాకును విసిరేసి, విచారంగా ఆమె కళ్లల్లోకి చూశాడు. ఆ దృశ్యం యెంత అద్భుతంగా వుం దనుకున్నావు బిడ్డా! ఇద్దరూ యిద్దరే: ఒకరి సొంగు తీసిపోని సాహసికులు. ఒకరినింక మరొకరు క్రూరమృగాల్లాగా చూసుకుంటున్నారు. ఆ దృశ్యానికి నేను, చంద్రుడు మాత్రమే సాక్షులం.

''సరే. 'విను లాయికో! నిన్ను ప్రేమిస్తున్నాను!' అంది రాద్దా. కాళ్లూ చేతులూ బంధింపబడ్డ వానివలె అతను భుజాలను మాత్రం యెగరేశాడు.

'నేను చాలామంది సాహసికుల్ని చూశాను; కాని, నీయంతటి ధైర్యశాలిని గాని, ఆత్మ సౌందర్యంలోనేమి అంగ సౌష్టవంలోనేమి నీలాంటి అందగాడిని గాని నే నింతవరకు చూళ్లేదు. నేను కన్నుమీటితే చాలు. వా ళ్లంతా మీసాలు తీసే స్తారు: ఊఁ అంటే నా పాదాల ముందు మోకరిల్లుతారు. కాని,

మేం లాభం? వా ళ్లెంత, వాళ్ల ధైర్య మెంత? పట్టుమని పది రోజులు తిరక్కుండా వా ళ్లందర్నీ ఆతంగి సింగన్నల్ని చేసెయ్య గలను. జిప్సీల్లో కూడా చెప్పుకోదగ్గ ధైర్యస్థులు బహుకొద్దిమందే మిగిలారు. లాయికో! కాని, నిన్ను మాత్రం ప్రేమిస్తున్నాను. అంతేకాదు, స్వాతంత్రాన్ని కూడా ప్రేమిస్తాను. స్వాతంత్ర్యాన్ని —లాయికో!—నీకన్న మిన్నగా ప్రేమిస్తాను. నేను లేకుండా నువ్వెల్లా జీవించలేవో, అలాగే నువ్వు లేకుండా నేనుకూడ బ్రతుకలేను. అంచేత — వింటున్నావా లాయికో! — నీ తను, మనో, ప్రాణా లన్నింటితోను నువ్వు నా వాడివి ఐపోవాలి.' అంది.

అతను మందహాసం చేసి 'వింటున్నాను! నీ మాటలు విన్నకొద్దీ నా హృదయం ఉప్పొంగుతోంది! ఏదీ, యింకాచెప్పు!' అన్నాడు.

'ఇంకా చెపుతున్నాను. శ్రద్ధగావిను లాయికో! నువ్వెంత గింజుకున్నా యేమీ లాభంలేదు. నిన్ను లొంగతీసుకోగల శక్తి నా కుంది. అంచేత అనవసరంగా కాలం వృధాచెయ్యకు — నా ముద్దులు, కౌగిలింతలు నీ ముందు సిద్ధంగా వున్నాయి..... లాయికో! నిన్ను గాఢంగా ముద్దు పెట్టుకుంటాను! నా ముద్దుల మైకంలో నీ సాహసిక జీవితాన్ని మైమరుస్తావు .... ధైర్యశాలురైన జిప్సీ యువకుల మనస్సుల నుర్రూతలూగించే నీ పాట లిక స్టెప్పీలలో మార్మోగవు. ఇకముందు నీ రాడ్డా సమక్షంలో, నీ రాడ్డా కోసం సున్నితమైన, సుమధురమైన ప్రేమగీతాలు ఆలపిస్తావు.... అంచేత వృధాకాలం గడిపెయ్యకు. నేను చెప్తున్నాను— అంటే, నువ్వు

రేపు నీ కన్న న న్నధికురాలినిగా గుర్తించి నాకు లొంగిపోవా లన్న మాట! మా దండులోని యావన్మంది సమక్షంలోనూ నా ముందు మోకరించి నా కుడిచేతిని ముద్దెట్టుకుని, అప్పుడు నన్ను నీ భార్యగా చేసుకో!'

"ఏమి టీ రాక్షసిపిల్ల కోరిక! అటువంటి దెన్నడైనా జరగటంమాట అటుంచి, వినలేదుకూడాను. పూర్వం యెప్పుడో మాంటినెగ్రిన్‌లలో మాత్రం యిటువంటి ఆచారం వుండేదని పెద్దలవల్ల వినటమేగాని జిప్సీలలో — ఛా,ఛా! యెప్పుడూలేదు యిటువంటి ఆచారం. అంటే, ఆడదానితో సమానమని అంగీక రించటమన్న మాట! ఇంతకన్నా అపహాస్యమైన విషయం యిం కేమైనా వుంటుందా, చెప్పు బిడ్డా? తల పగలగొట్టుకున్నా యిలాంటి విషయాన్ని ఆలోచించలేవు!

"లాయికో ఒక ప్రక్క కురికి, రొమ్ముపై కత్తివ్రేటు తిన్నవానిలా ఒక్క పొలికేక పెట్టాడు. ఆ కేకతో స్టెప్పీఅంతా బొబ్బరిల్లింది. రాద్దా కూడ కంపించింది; కాని యే మాత్రం జంకలా.

'సరే, రేపటిదాకా సెలవు. మరి, రేపు నేను చెప్పినట్టు చెయ్యాలిసుమా! విన్నావా లాయికో?' అన్నది రాద్దా.

'విన్నాను. అలాగే చేస్తాన్లే.' అని జోబార్ మూలిగి రాద్దాకు చేతి నందించాడు. అతని వేపైనా చూడలా రాద్దా మళ్లీ. తుపాను గాలికి విరిగిన మహా వృక్షంవలె అతను నేలమీద కూలి పోయి మధ్య మధ్య నవ్వుతూ, వెక్కి వెక్కి యేడుస్తున్నాడు.

"దాని దుంపతెగ! రాద్దా ఆ యువకుణ్ణి యెంతగా రాచి

రంపాన పెట్టేసిందో చూశావా? నే సతనికి ఉపచారాలుచేసి కష్టం మీద స్పృహ తెప్పించాను.

"ఛీ,ఛీ! ప్రజలకీ బాధలన్నీ కలిగించే గాడిద యెవడంట? మానవహృదయం బాధతో మూలుగుతూంటే ఆలకించాలని కోరే ఆ బండరాయి—కటిక కసాయి యెవరు? ఆఁ, ఆ విషయమే కాస్త ఆలోచించు!....

"నేను డేరాకు తిరిగొచ్చి పెద్దలతో జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాను. అందరం ఆలోచించి చివరికి పర్యవసానం యెలా పరిణమిస్తుందో చూట్టానికే నిశ్చయించుకున్నాం. చివరికి జరిగింది కూడ చెపుతా విను: మేమంతా చలిమంట చుట్టూ కూర్చున్నాం. ఇంతలో లాయికో అక్కడికి కొచ్చాడు. అతని మనస్సంతా వికలమై వుంది. ఒక్క రాత్రిలో యేనుగులాంటి మనిషి పీనుగైపోయాడు. కళ్లు గుంటలు పడ్డాయి. చూపును క్రిందికి దించేసి, అతను మాతోయిలా చెప్పాడు—

'మిత్రులారా! నేను చెప్పేది వినండి. రాత్రి నా హృదయాన్ని గాలించి చూసుకున్నాను. ఇక నా పూర్వపు స్వేచ్ఛా జీవితానికి తావులేదని నిశ్చయించుకున్నాను. రాద్దా నా హృదయమంతా ఆక్రమించుకుంది. ఆమె నా హృదయంలో అహర్నిశలూ ఆడుకుంటోంది. కావాలంటే నా హృదయాన్ని చీల్చి చూడండి- రాద్దా రాణి నవ్వులు చిందుతూ అందులో ప్రత్యక్ష మవుతుంది. నాకన్న ఆమె తన స్వేచ్ఛ నెక్కువగా ప్రేమిస్తుంది; కాని నేను మాత్రం నా స్వేచ్ఛకంటె ఆమెనే అధికంగా ప్రేమిస్తున్నాను. ఆమె ఆజ్ఞాపించినట్లే మీ అందరి సమక్షంలోనూ నే నామె పాదాల

ముందు మోకరిల్లుతాను. మోకరిల్లి, సాహసికుడైన జోబారును- రాద్దాను చూడకమునుపు కన్నెపడులచ్ఛుతో—బాతులతో హంసలా క్రీడలాడిన జోబారును — రాద్దా తన సౌందర్యంతో యేవిధంగా దాసుణ్ణి చేసుకుందో మీ అందరికీ నిరూపించడానికే నిశ్చయించు కున్నాను. ఇక అప్పు డామె నా భార్యయై, నన్ను ముద్దాడి, లాలిస్తుంది. అప్పు డిక పాటలు పాడి మీకు వినిపించే స్వేచ్ఛా వకాశాలు నాకుండబోవు. అయినా నాకు సమ్మతమే! ఏం రాద్దా?— కళ్లెత్తి ఆమెవంక చూశాడు. ఆమె తలవంచి, మౌనంగా, దృఢంగా నిలబడి చేత్తో తన పాదాలవైపు సౌంజ్ఞ చేసింది. మేమందరము గ్రుడ్లప్పగించి చూశాం; కాని, మా కేమీ అర్థం కాలా. వీరాధి వీరుడైన లాయికో జోబార్ ఒక కన్య కాళ్లమీద మోకరిల్లడం— ఆ కన్య రాద్దాయే అయినా — చూడాల్సివస్తుం దేమోనని మే మక్కడినుంచి తప్పుకోవాలని కూడ అనుకున్నాం. ఏమిటో, అదంతా చాలా సిగ్గుచేటుకుగానూ, దీనంగానూ, మొత్తంమీద ఘోరంగానూ కనిపించింది.

'ఊఁ!'—గర్జించింది రాద్దా.

'హుష్! తొందరపడబోకు; అందు కింకా బోలెడంత వ్యవధి వుందిలే...' అంటూనే అతను పెద్దపెట్టున నవ్వసాగాడు.

'మిత్రులారా! వ్యవహారం యిప్పటికి పూర్తయింది' ఇంక మిగిలిం దేమిటంటారా? నా రాద్దా హృదయం— నిజంగా తాను నాకు చూపినంత దిట్టమైనదేనా అన్న విషయం చూడాల్సి వుంది. సోదరులారా! క్షమించండి—మరి, చూడక తప్పుతుందా!' అన్నాడు లాయికో.

"అబ్బ! జోబార్ ఉద్దేశ మేమిటో మేమింకా గ్రహించనే లేదు. యింతలోనే రాద్దా నేలకు కూలిపోయింది. రాద్దా వక్షంలో జోబార్ కత్తి పిడిదాకా దించుకుపోయింది. మే మంతా స్తభించి పోయాం.

"కాని, రాద్దా కత్తిని పెరికిపారేసి, నల్లని తన జడలోని ఒక పాయతో గాయాన్ని అదిమిపట్టి, మందహాసం చేస్తూ విస్పష్టంగా, బిగ్గరగా చెప్పింది:

"ప్రియ లాయికో, సెలవు! ను వ్వీపని చేస్తావని నాకు ముందే తెలుసు!....' అంటూనే ఆమె ప్రాణం విడిచింది.

"ఆ పిల్ల మనస్తత్వం నువ్వు అర్థం చేసుకోగలవా బిడ్డా? దాని దుంపతెగ! అది పిల్లా, పిశాచా!"

"అబ్బ! గర్వాలరాణీ! యిప్పు డిక నీ పాదాలముందు మోకరిల్లుతాను!' లాయికో స్టెప్పీఅంతా మారుమోగేలా అరిచి నేలపై కూలి రాద్దా పాదాలను పెనవేసి ముద్దుపెట్టుకుని శవంవలె అలాగే వుండిపోయాడు. టోపీలను తీసి, మేమంతా నిలబడి పోయాం.

"అల్లాంటప్పుడు ను వ్వేం చెప్తావు బిడ్డా? సరే, సరే! తర్వాత 'ఇతణ్ణి బంధించాలి!' అన్నాడు నూర్. లాయికో జోబార్‌ను పట్టుకుంటానికి యే ఒక్కడూ వూనుకో డనే సంగతి నూర్‌కూ తెలుసు. చేతినూపి అత నొక ప్రక్కకు వెళ్లిపోయాడు. కాని, దానిలా రాద్దా విసిరేసిన బాకును తీసి దానివంక రెప్ప లార్పకుండా చూశాడు. నెరిసిన అతని మీసాలు కంపించినై. రాద్దా యువకరక్త మింకా ఆబాకుమీద పేరుకోలా. బాకు వంక

తిరిగి మంచి వాడిగా వుంది. అకస్మాత్తుగా దానిలా వెళ్లి బాకుతో జోదార్ వీపుమీద గుండెకు తిన్నగా గురిచూచి ఒక్కపోటు పొడిచాడు. మరి, రాద్దాకు తండ్రిఐదూ ముసలి దానిలా!

లాయికో తల పైకెత్తి దానిలావంక చూచి 'ఓహో!' అని, రాద్దాను పిలుసుకొనేందుకు తక్షణం పరలోకయాత్ర సాగించాడు.

"మేము చూస్తుం డగా, తన జడపాయతో రొమ్ము మీది గాయా న్నదుముకుని రాద్దా పడివుంది. ఆమెకళ్లు నింగి సితారల్లోకి తొంగి చూస్తున్నాయి. జిప్సీలలో కెల్ల అద్భుతం సాహసికుడైన లాయికో జోదార్ ఆమె పాదాలచెంత పడివున్నాడు. అతని గిరజాలు ముఖాన్ని కప్పివేశాయి.

"ఆలోచిస్తూ మే మంతా అలాగే నిల్చుండిపోయాం. ముసలి దానిలా మీసాలు కంపిస్తూనే వున్నై. ఒత్తైన అతని కనుబొమలు ముడి వడ్డాయి. ఆకాశంకేసి చూస్తూ అతను మౌనంగా వుండి పోయాడు. కాని ముసలి నూర్ మాత్రం పండుముసలాంటి తన తెల్లని ముఖాన్ని నేలకాన్చి వెక్కివెక్కి ఏడ్చాడు.

"నిజంగా అది ఏడవాల్సిన సంగతేమో బిడ్డా! ...

"ఇక వెళ్లు. దిక్కులు చూడకుండా నీ దోవన నువ్వెళ్లు. తిన్నగా ముందుకు పో. లేకా, వృథాగా ప్రాణం కోల్పోతావేమో! ఇక పూర్తయింది బిడ్డా!"

చెప్పడం ఆపి, పైపును పొగాకు సంచిలో ఉంచాడు. మకార్ తన కోటు కోటును గట్టిగా బిగించుకున్నాడు. అంతలో జడివాన ప్రారంభమైంది. గాలి తోడైంది. సముద్రపుహోరు మరింత గంభీరమై ధీరంగా వినవస్తోంది. ఐనాను వెండి

మరొకటిగా గుర్రాలన్నీ చలిమంట వద్దకు చేరి. తమ తెలివైన కళ్లతో ఒకసారి మా వంక చూసి. మా చుట్టూ వలయాకారంలో నిలబడ్డాయి.

"హేయ్!" అంటూ మహర్ వాటిని ప్రేమతో సంభావించి. తనకు మరీ ప్రియమైన నల్లగుర్రం జూలు దువ్వుతూ నా వేపు తిరిగి "నిద్రవేళ అయింది.!" అంటూనే తన కోసక్ కోటును తలపైకి లాక్కొని, నేలమీద కొరిగి గుర్రుపెట్టాడు. నాకు మాత్రం నిద్రపట్టలా. నాముందు స్టెప్పీలలోను. సముద్రం మీదా. పరిసర ప్రకృతిలోనూ అందాల రాణి — రాద్దా మూర్తి హుందాగా మెసిలినట్లనిపించింది. ఆమె తన జడపాయతో రొమ్ము మీది గాయాన్ని అదిమి పట్టింది. ఆకాశంమీదినుంచి రాలే అందమైన అరుణతారలవలె ఆమె వ్రేళ్ల సందులనుండి రక్తపుబొట్లు రాలుతున్నాయి.

ఆమె పాదాలచెంతనే జోబార్ పీనుగ మూర్తి వుంది. ఉంగరాలు తిరిగి, ఒత్తైన నల్లని అతనిజుట్టు ముఖాన్ని కప్పివేసింది. ఉంగరాలనుండి సన్నని ధారగా శీతల బాష్ప బిందువులు స్రవించాయి.

వాన జోరైంది. అందమైన జిప్సీగీతం — లాయికో జోబార్, రాద్దాలకు నీరాజనంగా సముద్రం విషాదగీత మాలాపించింది.

ఆ యిద్దరి మూర్తులూ రాత్రంతా మౌనంగా నాముందు పరిభ్రమించాయి. మధుర గాయకుడు — లాయికో మూర్తి ఎంత ప్రయత్నించినా ఆ గర్వాల రాణి — రాద్దా ప్రక్కకు చేరుకోలేక పోయాడు.

(10)

# పీఠాధిపతి

(వ్యంగ్య కథ)

....అతను అర్ధరాత్రివేళ అదురుతూ బెదురుతూ నాగదిలో ప్రవేశించి, గది నలువంకలా అనుమానంగా కలయచూసి లోగొంతులో ప్రశ్నించాడు :

"నీతో ఏకాంతంగా ఒక్క అరగంటసేపు మాట్లాడాలి. ఇప్పుడు నీకు వీలే కదూ?"

అతని స్వరంలోనేమి, అస లతని శరీరభంగిమలోనేమి ఒక విధమైన నిగూఢత యిమిడివుంది. మొనదేలి పొడుచుకు వచ్చిన తన శరీరపు ఎముకలబరువును కుర్చీ భరించగలదాఅని అనుమానిస్తూన్నట్లు అతను జంకుతూ గొంకుతూ కూర్చున్నాడు.

"కిటికీను కొద్దిగా క్రిందకు దింపుతావా?" అతను మెల్లగా ప్రశ్నించాడు.

"తప్పక" అని జవాబిచ్చి, అతని కోర్కెను మన్నించ డానికై లేచాను. అతను కృతజ్ఞతా సూచకంగా తల వంకిస్తూ కిటికీవంక తిరిగి కండ్లు చికిలించి మరింత మెల్లిగా అన్నాడు:

"వా ళ్లెప్పుడూ కాసుకునే వుంటారు."

"వాళ్లంటే?"

"విలేఖరులు."

అతన్ని పరీక్షగా చూశాను. నీటుగా గోటుగా దుస్తులు ధరించినా బీదతనం ఒక మూలనుండి తొంగిచూస్తూనే వుంది. అతని బట్టతల కళాయిపోయిన అద్దంవలె కాంతిహీనంగా మెరు

స్తోంది. గడ్డం సున్నగా వుంది. పలచని కనుబొమలక్రింద బూడిద రంగుకళ్లు క్షమాపణపూర్వకంగా నవ్వుతూన్నట్లున్నాయి. ముఖం అతికోలగా, దోసకాయవలె వుంది. అతని చూపులు నామనస్సులో అదొక విచిత్రమైన శూన్యభావాన్ని రేకెత్తించాయి. పాదాలను కుర్చీ క్రిందకు దూర్చి, కుడిచేతిని మోకాలుమీద ఆన్చి, ఎడమచేత్తో డెర్బీ టోపీని గిరగిర త్రిప్పుతూ కూర్చున్నాడు. అతని పొడుగు పాటి వ్రేళ్లు కంపిస్తున్నాయి.

నిట్టూర్చి, కిటికీవంక పక్కవాటుగా చూసి తన్ను తాను పరిచయం చేసుకోనారంభించాడు. "నే నొక పాపిని. నా వుద్యోగ విధియే పాపం చెయ్యమని చెప్పొచ్చు...."

విననట్లు నటించి, యాదాలాపంగా ప్రశ్నించాను ;

"ఏమన్నావు?"

"పాపాలు చెయ్యటమే నా ఉద్యోగం" అతను రెట్టించి చెప్పాడు. "సామాజిక నీతిసూత్రాలను ఉల్లంఘించడమే నా ప్రత్యేకత."

అతని స్వరం వినయపూర్వకం గానే వున్నా అతని ముఖ కవళికల్లోగాని, మాటల్లోగాని పశ్చాత్తాప ఛాయ లేమాత్రం నాకు గోచరించలేదు.

"నీకు....మంచినీ ళ్లేమన్నా కావాలా?" అని అడిగాను.

"అక్కర్లేదు. నీ ఆదరానికి కృతజ్ఞత" అంటూ నిరాకరించి, క్షమాపణపూర్వకమైన తన చూడ్కులు నాపై బరపి ప్రశ్నించాడు: "నేను చెప్పింది నీ కేం బోధపడలేదనుకుంటానే?"

"బోధపడ కేం?" యూరపియను పత్రికా విలేఖరులవలె

అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకోడానికై బుకాయించపూనుకున్నాను. కానైతే, అతను నన్ను నమ్మినట్లులేదు. డెర్బీటోపీని గిరగిర త్రిప్పుతూ చెప్పనారంభించాడు :

"ముందు నా ఉద్యోగాన్ని గురించి కొంత తెలుసుకుంటే కాని నే నెవరో నువ్వర్థం చేసుకోటం కష్టమే...."

అత నంతలోనే తిరిగి నిట్టూర్చి, తల వాల్చాడు. అతని నిట్టూర్పులో ద్యోతకమైన నైరాశ్యానికి నా కెంతో ఆశ్చర్యం కలిగింది.

డెర్బీ టోపీని త్రిప్పుతూ "నీకు జ్ఞాపకముందా, యీ మధ్యనే ఒక వ్యక్తిని గురించి పత్రికల్లో పడినకధ....అదే, త్రాగుబోతును గురించి? సినిమాహాల్లో గల్లంతూ అదీ?"

"మొదటి వరుసలో కూర్చుని, ఆటలోని అతి విషాదకర ఘట్టంలో లేచి, టోపీధరించి టాక్సీబండికోసం బొబ్బపెట్టిన పెద్దమనిషి సంగతేనా నువ్వు చెప్పేది?" అని ప్రశ్నించాను.

"ఔనౌను" అంటూ ధృవపరచి అతను తిరిగి అందుకున్నాడు : "అదినేనే. 'పసిపాపలను బాదేపశువు' అన్న శీర్షిక కూడా నన్నుగురించే. 'భార్యను విక్రయించిన భర్త' అని పడ లేదూ, అదీ నేనే. ఇంకొకటుంది—నడివీధినిపోయే స్త్రీని బూతు కూతలు కూసి అవమానపరచిన పెద్దమనిషి—అని. అదికూడా నేనే. సాధారణంగా వారాని కొకసారి అయినా నా పేరు పేపర్లో పడుతూనే వుంటుంది. ముఖ్యంగా ప్రజల్లో నైతిక ప్రవర్తన యెంతటి హీనస్థాయిలో వుందో నిరూపించే ప్రతి సందర్భంలోనూ నా పేరు తాటికాయలంతేసి అక్షరాల్లో పడుతూ వుంటుంది."

అత నీ విషయాలన్నీ అతి ప్రశాంతంగా, విస్పష్టంగా, నిగర్వంగా చెప్పుకు పోయాడు. నే నతన్ని అవగింజంతైనా అర్థం చేసుకోలేకపోయాను. కాని ఆ విషయం వ్యక్తం చెయ్యడానికి మనస్కరించక రచయిత లంపరివలెనే జీవితాన్ని గురించీ ప్రజలనుగురించీ సర్వజ్ఞత్వాన్ని ప్రదర్శించపూనుకున్నాను.

పెద్ద తత్వవేత్తలా "ఊహూఁ!" అన్నాను. "అయితే నీ కల్లా కాలం గడపటం నచ్చించన్నమాట?"

"చెప్పొద్దూ, నా యౌవనంలో యి దంతా తమాషాగానే వుండేది." అతను జవా బిచ్చాడు. "నా కిప్పుడు నల్భై అయిదేళ్ళు. పెళ్ళాం, యిద్దరు ఆడపిల్లలు.— నీతి బాహ్య ప్రపంచంలో విధిగా వారానికి రెండు మూడుసార్లు పత్రికల్లో పేర్కొనబడటం యిప్పుడు బహు సంకటంగా, యిరకాటకంగా వుంటోంది. వాళ్ళమ్మకడుపులు కాల! యీ విలేఖరులు సర్వకాల సర్వావస్థల్లోను నీడలవలె వెన్నంటి నా కార్య కలాపాలను సక్రమంగా, సలక్షణంగా నెరవేరుస్తున్నదీ లేనిదీ ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తూ, చెవులు దోరబెట్టుకుని వింటూ వుంటారు—"

నా విభ్రమాన్ని కప్పిపుచ్చడాని కై మెల్లిగా దగ్గి, ప్రశ్నించాను.

"అయితే నీ విషయంలో ఆ దొంగ జబ్బు అన్నమాట: అంతేనా?"

కా దన్నట్లుగా తల పంకించి, టోపీతో విసురుకుని జవా బిచ్చాడు.

"నా ఉద్యోగమే అంత. నడివీధుల్లోను, సమావేశ సలా

ల్లోను చిల్లర మల్లర గలాటాలు చెయ్యడమే నా ప్రత్యేకత అని ముందే చెప్పానుగా—— మా సమితిలోని యితర సభ్యులు యింత కన్న గురుతరము, బాధ్యతాయుతమైన పనులు చేస్తూ వుంటారు. అంటే మత విశ్వాసాలను భంగపరచడం, స్త్రీల, బాలికల సౌశీల్యం పాడుచెయ్యడం, పెయ్యిడాలర్లకు మించని- చిన్నవే అనుకోండి- దొంగతనాలు చెయ్యడం- యిల్లాంటివన్నమాట" అతను నిట్టూర్చి, చుట్టూ కలయచూచి కొనసాగించాడు - "నీతి విరుద్ధమైన యిటువంటి పను లింకెన్నో వాళ్లు చేస్తూంటారు. నేను మాత్రం చిన్న గలాటాలు చేస్తానంతే"

వ్యాపారస్తులు తను వ్యాపారాన్ని గురించి సరిగా యెల్లాగ మాట్లాడుతారో అతనుకూడ అదే విధంగా మాట్లాడుతున్నాడు. నాకు చిరాకెత్తి వ్యంగ్యంగా ప్రశ్నించాను :

"అయితే, నీ కా పని నచ్చలేదా యేమిటి?"

"లేదు" అతను క్లుప్తంగా జవాబిచ్చాడు.

అతని జవాబు నన్ను చిత్తుచేసి నా మనస్సులో విభ్ర మాశ్చర్యాలు జనింపచేసింది.

"నువ్వెప్పుడైనా జైలుకు పోయావా?" అని ప్రశ్నించాను.

"మూడుసార్లు మాత్రం పోయాను. సర్వసాధారణంగా జరిమానాలతోనే సరిపెడుతూ వుంటాను. జరిమానాలన్నీ సమితే చెల్లిస్తుందిలే" అతను వివరించాడు.

"సమితి?" అప్రయత్నంగా రెట్టించాను.

ఔను మరి. నేనే చెల్లించుకోవాలంటే యెంత కష్టమో ఆలోచించు. మందహాసం చేస్తూ అతను చెప్పాడు. "నలుగురు

గల కుటుంబానికి వారానికి 50 డాలర్లంటే యేమూలకో చెప్పు?"

"కాస్త ఆలోచించి చెప్తా నుండు" లేస్తూ నే నన్నాను.

"అవశ్యం" అతను అంగీకరించాడు.

ప్రపంచంలో వున్న రకరకాల ఉన్మాదాల్లో యి దేరకం ఉన్మాదమూ అని నాలో నేను వితర్కించుకుంటూ గదిలో పచార్లు చెయ్యసాగాను. కాని, అతని రోగనిదానం చెయ్యటంలో నేను సాఫల్యం పొందలేకపోయాను. ఒకటి మాత్రం స్పష్టం — గౌరవోన్మాదం (Megalomania) మాత్రం కాదు. అతను చిరునవ్వు నవ్వుతూ ఓపిగ్గా నా జవాబుకై నిరీక్షించాడు:

"అయితే, యిటువంటి సమితి ఒక టుందన్నమాట?" అతని యెదుట ఆగి ప్రశ్నించాను.

"ఔను."

"అది చాలామందికి ఉద్యోగా లిచ్చిందా?"

"ఈ పట్నంలో మట్టుకు యీ పట్నంలో నూటపాతిక మంది పురుషులు, డెబ్భైయైదు మంది స్త్రీలు సమితి ఉద్యోగంలో వున్నారు."

"ఈ పట్నంలోనా? అయితే యితర పట్నాల్లో కూడ యిల్లాంటి సమితు లున్నాయా?"

"లేకేం, దేశమంతటా వున్నాయి" అతను సానుభూతి పూర్వకంగా నవ్వుతూ చెప్పాడు.

నా అజ్ఞానానికి నామీద నాకే జాలికలిగింది.

"మరైతే వాళ్ళెట్లా ..." సంకోచిస్తూ నేను ప్రశ్నిం

చాను. "ఆ సమితు లేంచేస్తాయి?"

"నీతి నియమాలను ఉల్లంఘించడమే వాటిపని" సౌమ్యంగా జవాబిచ్చి, పడకకుర్చీలో మేనువాల్చి, నా వంక వింతగా చూడ నారంభించాడు. న న్నొక అడవి జంతువుగా అతను పరిగణించినట్లున్నాడు. యిక దానితో తన యిష్టం వచ్చినట్లు ప్రవర్తించ నారంభించాడు.

"డామిట్! కథ అడ్డం తిరిగిందే! అదంతా దేన్ని గురించో నాకు తెలియదన్న సంగతి బయట పడనివ్వకూడ దని నిశ్చయించుకుని హుషారుగా ప్రశ్నించాను :

"ఆఁ ఆఁ, బలేగావుందే! బలే తమాషాగా వుంది! అది ....అవి దేనికోసం?"

"ఏమిటి?" అతను మందహాసం చేశాడు.

"నీతి నియమాల నుల్లంఘించే యీ సమితులు దేని కోసమంట?"

అతను నవ్వాడు. అతని నవ్వు సరిగా కుర్రవాని బుద్ధి హీనత చూసి పెద్దవాడు సానుభూతిపూర్వకంగా నవ్వినట్లుంది. అతని వంక చూశాను. అలా చూసినకొద్దీ నా మనస్సులో 'యీ అజ్ఞానమే కదా ప్రపంచంలోని దరిద్రా లన్నింటిలోకీ గొప్ప దరిద్రం అనిపించసాగింది.

"మనిషి బ్రతకాలని అనుకుంటాడు, ఔనా?" అతను ప్రశ్నించాడు.

"సంతోషంగా బ్రతకాలనికూడ అనుకుంటాడు కదా?"

"ముమ్మాటికీ"

అతను లేచి నా భుజం తాటించాడు.

నీతి నియమాల నుల్లంఘించకుండా మనిషి సంతోషంగా బ్రతకడ మెల్లాగ నాయనా?"

కుర్చీమీద దఫేలున చతికిలపడి, నా అభిమతం తీసుకో కుండానే చుట్టతీసి వెలిగించి గుప్పుగుప్పున పొగ వదల నారం భించాడు. కొంతసేపాగి మళ్లీ అందుకున్నాడు :

"ఆపిలుపళ్లు కొని ద్రావకంలో ముంచుకు తినే మూర్ఖు డెవడన్నా వుంటాడా?"

కాలుతున్న అగ్గిపుల్లను నేలమీద పారేశాడు.

అదెప్పుడూ అంతే--యెవటివాడి లోకువ చిక్కిందా యిక చూసుకో తస్సాదియ్యా, గాడిదమీద సవారీ చేసినట్లు వాడిమీద సవారీ చేశామన్నమాటే.

"నువ్వు చెప్పేది నాకు పూర్తిగా బోధపడతేదు" అతని ముఖంవంక చూస్తూ అంగీకరించాను.

అతను చిరునవ్వు నవ్వి అన్నాడు :

"ఓష్! నువ్వింకా యేదో పెద్దబుర్రలో గుంజున్న మనిషి వనుకున్నానే!"

అతను దర్జాగా చుట్టనుసి నేలమీద దులిపి, కళ్లర మోడ్చి పొగమేఘాలను తిలకిస్తూ ఆ విషయంలో పెద్ద ఘనా పాఠివలె ముఖం చెప్పసాగాడు :

"అసలింతకీ నీతిని గురించి నీ కాస్తే తెలియ వనుకుంటా."

"అప్పుడప్పుడు నా కది తటస్థపడినట్టే జ్ఞాపకం" సవిన

యంగా సమరించాను.

నోట్లోంచి చుట్టతీసి కాలుతున్న వేపు పరీక్షించి వేదాంతపు ధోరణిలో చెప్పనారంభించాడు:

“గోడకి నీ తల తగిలి, బొప్పికడితే గోడను నువ్వు అర్థం చేసుకున్నట్లు కాదు.

“ఆమాట నిజమే అనుకో. బంతిని గోడకు వేసి యెంత గట్టిగా కొడితే అ దంత యెక్కువ దూరం పోతుంది. నైతిక ప్రవర్తన విషయంలో సరిగా నేనుకూడ అంతే.”

“ఆ లోపానికి కారణం నీ పెంపకం. అంతకన్న మరేం కాదు” అతను నిర్ధరించాడు.

“అయితే కావచ్చు” నే నంగీకరించాను. “నే నింతవరకు చూసిన వాటిలో నీతివేత్తలు, సత్ప్రవర్తకులలో కెల్ల మా తాత మేటి. స్వర్గానికిపోయే బాటలన్నీ ఆయనకు కరతలామలకం. అడిగినా అడక్కపోయినా తనకు తారసిల్లిన ప్రతివాడికీ ఆయన వాటిని చూపిస్తూనే వుండేవాడు. ఆ సత్యమార్గం ఆయన కొక్కనికే సాక్షాత్కారమైంది. ఇంక చూసుకో, నాన్న తన కుటుంబంలోని యావన్మందికీ తల కెక్కించాలని ఆయన పడిన పాట్లకు అంతూ పంతూ లేదు. భగవంతుని దృష్టిలో మానవు డేవిధంగా మసలుకోవాలో ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. కాగా పిల్లలకు, కుక్కలకూ కూడ ఆయన శాశ్వతానంద సంధాయినియైన సత్ప్రవర్తనను బోధిస్తూండేవాడు. అంత మాత్రాన ఆయనలో ద్వేష, కావేషాలు గాని, దురాశగాని లేవనుకుంటారేమో, అన్నీ కొల్లలుగా వున్నాయి. అంతేకాదు, అబద్ధమాడి దేవాలయంలో దీపమార్ప

టంలో ఆయన అందెవేసినచెయ్యి. వడ్డీలకు వడ్డీలు కట్టి కొంపలు కూల్చటంలో నేర్పరి. అసమర్థ దుర్జనత్వంలో సాటిలేని మేటి—అసలీ జబ్బు సత్ప్రవర్తకులందరికీ వుండేదే ననుకుంటాను—తీరిక చిక్కినప్పుడల్లా, యింట్లో అందరినీ బాపమోదుతూండేవాడు ...ముసలాడిని సాధుమార్గంలోకి తెద్దామని మహా ప్రయత్నించాను—ఒకమారు కిటికీలోంచి క్రిందకు త్రోసేశాను; మరొకమారు అద్దంపెట్టి ముఖం బ్రద్దలయ్యేట్లా కొట్టాను—కిటికీ, అద్దం బ్రద్దలయ్యాయేగాని ముసిలాడు మాత్రం పిసరంతైనా బాధపడలేదు. నీతి వేత్తగానే చనిపోయాడు. ఆనాటినుండి చూసుకో, నైతికనిష్ఠ అంటే నాకు మహామంట ...ఆ విషయంలో నా అభిప్రాయం నువ్వేమన్నా మార్చగలవాంటః" నేను సూచించాను.

గడియారంతీసి, టైముచూసి అన్నాడు :

"నీకు ఉపన్యాసాలిస్తూ కూర్చునేందుకు నాకు తీరిక లేదనుకో.. .అయినా తీరా మెలాగూ వచ్చాను కనుక నాలుగు సంగతులూ చెప్తే తీరిపోతుంది. ప్రారంభించినపని పూర్తి చెయ్యాల్సిందేగా. నాకు నీవల్ల ఏమైనా కొంతపనికూడా కావచ్చునేమో.... సూక్ష్మంలో మోక్షంగా చెప్తానులే...."

అతను మరల కంఠస్వరమెత్తి ధాటీగా చెప్పనారంభించాడు:

"నైతిక సత్ప్రవర్తన కలిగివుండాలి—తెలిసిందా! ఎందుకు కలిగివుండాలంటావేమో? అది నీ యింటినీ, హక్కులను, నీ ఆస్తినీ కాపాడుతుంది—వేరు మాటల్లో చెప్పాలంటే అది 'నీ పొరుగువాని' ప్రయోజనాలను పరిరక్షిస్తుంది. 'నీ పొరుగువాడు'

అన్నప్పుడెప్పుడూ దాని అర్థం నువ్వే నన్నమాట; మరెవ్వరూకాదు, తెలిసిందా? నీకు అందమైనభార్య వుందనుకో; అప్పుడు నీ చుట్టూ కలవారితో ను వ్వేం చెప్తావు? "పరస్త్రీ సాంగత్యం మహా పాతకం" అని చెప్తావు. వెయ్యేందుకు, ధనం, పాడిపంటలు, దాసదాసీలు కలిగి స్వతహాగా మూర్ఖుడు కానివాడెవడన్నా సరే— తప్పకుండా నీతివేత్త అయ్యుంటాడు. సమస్త భోగభాగ్యాలూ కలిగి, వాటిని తమకు మాత్రమే నిలుపుకోవాలని కోరుకునే వారికి బాగా నీతి సూత్రాలు వినియోగపడతాయి. తలమీది వెంట్రుకలు తప్ప మరే ఆస్తిపాస్తులూ లేనివారికే నీతిసూత్రాలవల్ల ప్రయోజనం సర్వశూన్యం."

బట్టతల తడుముకుని అతను తిరిగి కొనసాగించాడు:

"బాహ్య ప్రపంచపు వీధుల్లో పోలీసువాళ్ళను అపరాధ పరిశోధకులను కాపలా వుంచినట్లుగానే మానసిక వీధుల్లో నీతి సూత్రాలను కాపలా వుంచాలి. మన హక్కుల్ని పొరుగువాళ్లు సరిగా పాటించేట్లు చేసే రక్షకభటులుగా నీతి సూత్రాలకు అన్వయం చెప్పవచ్చు. ఈ నీతి సూత్రాలు మనుష్యుల మనస్సుల్లో గాఢంగా పాతుకుపోయి, మన హక్కులకు విరుద్ధంగా వారి మనస్సుల్లో జనించే భావాలను, కోర్కెలను నలిపి నాశనం చేసివేస్తాయి. ఎక్కడైతే వర్గవైరుధ్యాలు ప్రబలంగా వుంటాయో అక్కడే నీతి నియమాలు మరింత కఠోరంగా వుండటం చూస్తూవుంటాము. ఎంత ధనికుడైతే అంత కఠోరనీతివేత్త అయ్యుంటాడు. అందేతనే ధనికు లెక్కువగాగల అమెరికాలో నీతి నియమాలు నూటికి నూరు పాళ్లు అమలుపరుస్తూంటారు తెలిసిందా?"

"తెలిసిందనుకో" నే నన్నాను "ఇంతకీ దీంట్లో సమితి ప్రసక్తి ఎక్కడొచ్చింది?"

"ఉను మరి!" సిద్ధనిలా చెయ్యెత్తి సన్నవలించి, తిరిగి కొనసాగించాడు." కాబట్టి, నీ విషయంలో యితరు లెవ్వరూ జోక్యం చేసుకోకుండా వుండాలని బోధించడమే నీతి సూత్రాల పరమ ప్రయోజనమన్నమాట. నీకు దండిగా ధనం వుందనుకో. అప్పుడు నీకు రకరకాల కోర్కెలు వుంటాయి. అంతేకాక వాటిని తీర్చుకునే వ్యాప్తి అవకాశం కూడ వుంటుంది కదా? కాని, అటు వంటి కోర్కెల్లో చాలావరకు నీ నీతి నియమాలను ఉల్లంఘించితే గాని నెరవేరవు ...అప్పుడిక మరి నువ్వేం చెయ్యాలి? నువ్వే ఆచరించని వాటిని నువ్వు బోధిస్తే బాగుండదు సరికదా అసంద ర్భంగా వుంటుంది. పైగా ప్రజలు నిన్ను నమ్మరు. అయినా, ప్రజల్లో అంతా మూర్ఖులని అనుకోవడానికి వీల్లేదుకదా? ... ఉదా హరణకు, నువ్వే వున్నావనుకో. ఒక పెద్ద హోటల్లో అందమైన యువతి ప్రక్కన కూర్చుని, షాంపేను త్రాగుతూ ఆమె నీ భార్య కాకపోయినా ముద్దుపెట్టుకుంటూ వుంటావు....ప్రజలు ఆచరించ దగ్గవిగా నువ్వు బోధించే నీతి సూత్రాల ప్రకారం నువ్వు చేసేపని నీతి బాహ్యమైనదే. కాని నీ మట్టుకు ఆపని ఎంతో ఆనందదాయ కం, అపస్వ్యకరణీయం. నీ కదొక అలవాటేకాదు. దాంట్లో నీకు పరమానందం కలుగుతుంది. అప్పుడే వస్తుంది పెద్దచిక్కు. ఒక మూల నువ్వు ఆపని పాపమనీ, పనికిరాదనీ చెప్తున్నావో, అదే నీకు సుఖాన్నిస్తుంది: కనుక దాన్నే నీవు కోరుతున్నావు. ఈ రెండింటికీ మరి లంగరెక్కడ కుదురుతుంది? ఇంకొక ఉదా హరణ— 'దొంగతనం చేయరాదు' అని బోధిస్తావు. కాని నీ

దగ్గరొక మూల ధనం మూలుగుతున్నా మరి కొంత దొంగిలించాలనే అపుకోలేనికోర్కె నీకు కలుగుతూనే వుంటుంది. 'జీవహింస చేయరాదు' అనికూడ గట్టిగా వాదిస్తావు. ఎందుకోసం? జీవితం సుఖదాయకం అని నీవు నమ్ముతావుకనుక. ఒకరోజున నీగదిలో పనిచేసే కూలీలు మరి రెండణాల కూలిపెంచమని సమ్మెచేస్తారు. 'జీవహింస చేయరాదని' బోధించే నువ్వే వెంటనే పోలీసుల్ని పిలిపిస్తావు — తప్పేముందామరి!—అంతే టపీటపీ! పాతిక మున్నైమంది కూలీలకు ఆనాటితో భూమిమీద నూకలు చెల్లిపోతాయి. లేక, నీ సరుకులకు గిరాకీ లేదనుకో. మీ ప్రభుత్వాధికారులవద్దకు పోయి, నీకు మార్కెటు కావలసిన విషయాన్ని వారికి నచ్చచెప్పుతావు. ప్రభుత్వము వెంటనే ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని ఏదో ఒక దేశానికి సైన్యాన్ని పంపి, వందలూ వేలాదిగా ఆదేశీయుల్ని హతమార్చి నీ కోర్కెను తీరుస్తుంది.... కానైతే యీ నీ చర్యలన్నీ నువ్వింతవరకు బోధిస్తున్న సోదర ప్రేమ, బ్రహ్మచర్యము, మొదలైన నీతిసూత్రాలకు అనుగుణముగానే వున్నాయా అంటే, లేదనే చెప్పాలిసొస్తుంది. కాని కార్మికుల, ఆదిమవాసుల అకారణహత్యలన్నిటినీ శాంతి ధర్మాల, రక్షణ పేరిట సమర్థించుకోగలుగుతావు. ప్రజలు నువ్వు చెప్పినమాటకు జవదాటిననాడు శాంతిభద్రతలు నిలుస్తాయామరి? ప్రభుత్వం అంటే నువ్వే—దండిగా డబ్బున్నవాడు సుమా! నీకైనా జులాయికోరు జీవితం, దొంగతనం మొదలైన విషయాల్లో కొన్ని యిబ్బందులు కలిగేమాట నిజమేననుకో. కాని మొత్తంమీద చెప్పొస్తూ డబ్బున్నవాడి జీవితము ముళ్ళదారిమీద నడకలాంటిదనుకో. ప్రతి వాడూ తనను ప్రేమించటం, ఎప్పుడూ తన ఆస్తిపాస్తుల జోలికి

పోకుండా వుండటం, తన ప్రవర్తనపట్ల యితరులెవ్వరూ యెట్బెట్టు ప్రవర్తించకపోవటం, తనపెళ్లాంమీద గాని, అప్పచెల్లెండ్లమీద గాని ఒరులెవ్వరూ ప్రేమదృక్కులు బరపకపోవటం తన కత్యంతావశ్య కం. కాని, తానుమాత్రం యితరులెవరినీ సోదరభావంతో ప్రేమగా చూడవలసిన అగత్య మెంతమాత్రం లేదు. దోపిడీనుండి విర మించుకుంటే తనకు రోజు గడువదు. పరస్త్రీలను చెరపట్టకపోతే జీవితంలో హుషారే లేదు; తమాషాయే లేదు! చూడండి యెంతటి పరస్పరవిరుద్ధ ప్రయోజనాలో! ప్రతి విషయం తన ఆశయాల కడ్డువచ్చేదేకదా; ఖర్మ; నిజానికి దోపిడీయే ధనవంతుని జీవితం, కార్యక్రమము. ఏమంటారు? వేలకొద్దీ ప్రజలను- ఆమాటకొస్తే మొత్తం దేశాన్నే అతను దోచుకుంటాడు—— మరిలేకపోతే పెట్టు బడి వృద్ధిచెందే దెట్లా? బోధపడలేదూ——పెట్టుబడి వృద్ధిచెంద డంలోనే దేశాభ్యున్నతి యిమిడివున్నది? అతను చాలమంది స్త్రీలతో సాంగత్యం జరుపుతాడన్నమాట నిజమే. కాక, మరేం చెయ్యమన్నారు చెప్పండి? తనకా బోలెడంత విశ్రాంతి. ఆ విశ్రాంతి కాలమంతా యింతటి పరమసుఖాన్నిచ్చే స్త్రీసాంగత్యంలోకాక మరెట్లా జరుపమన్నారో, పోనీ మీరే చెప్పండి? యింక, యిత రులను ప్రేమించటంవిషయం: ప్రజలు అతనికి రెండు తరహాలుగా కనిపిస్తారు——ఒక తరహావారిని తాను దోచుకుంటాడు. వారిని రాను దోచుకుంటాడు. వారిని దోచుకోటంలో తనతో పోటీకి వస్తారు రెండో తరహావారు. మరి అల్లాంటప్పుడింక అత నెవరిని ప్రేమించాలి?"

తన విషయపరిజ్ఞానానికి తానే మురిసిపోతూ, నా ఉపన్యాస కుడు నోటిలోనున్న సిగరెట్టును (గదిలో) ఒకమూలకు విసిరేసె

తిరిగి యిలా ప్రారంభించాడు:

అందుచేత, నీతి నియమాలన్నది ధనికులకు అత్యవసరం. ప్రజాసామ్యానికి మాత్రం లాభశూన్యం; కాని, అదేసమయంలో నీతినియమానుష్ఠానం ధనికునకు అనావశ్యకం, యితరులందరికీ అవశ్యకరణీయం. అందుచేతనే నీతిపరులు తామమాత్రం నీతి సూత్రాలను నాలుక చివరధరిస్తూ ప్రజల మనస్సుల్లో మాత్రం వాటిని కరిగించిపోస్తూవుంటారు. ఇంక నైతికసూత్రాలను ఆచరణలో పెట్టవలసిన ఆవశ్యకతను ప్రజలచేత గుర్తింపచేయటం యెట్లాగన్న ప్రశ్న వెంటనే ఉదయిస్తుంది.

గంజాయివనములో తులసిమొక్క రాణించదుకదా అను కునేదీ. ప్రతివాడూ పదిమందీ పోయే త్రోవనే పోయేది. అప్పుడింక మార్గాంతరమేమిటి? బోధించి, ఒప్పించలేకపోయావు—ఇనుక మూఢుల్ని చేసివదులు! అంతే పని...."

అతను ఊతంగా తల పూదించి, కన్నుగిలిపి తిరిగి రెట్టించాడు:

"నమ్మించలేనప్పుడు—విమూఢుల్ని చెయ్యటమే మార్గం!"

తర్వాత నా మోకాళ్లమీద తట్టి, కండ్లలోనికి గ్రుచ్చిచూస్తూ లోగొంతులో చెప్పసాగాడు:

"మనలో మనమాట. యీ విషయం రహస్యంగా ఉంచాలి సుమా?"

నేను అంగీకరించాను.

"నేను పనిచేస్తూన్న సమితి వున్నదే. అదినేనుపైన చెప్పిన పనే చేస్తూవుంటుంది. అంటే ప్రజాభిప్రాయాన్ని విమూఢం చేస్తుం

దన్న మాట. ఏమనుకున్నావో, మా సమితివంటి విశిష్టమైన సమితి మొత్తం అమెరికాలోనే లేదంటే అతిశయోక్తి కాదు తెలుసా?"

నేను మరల తల ఊపాను.

"డబ్బు కూడబెట్టడమన్న ఒకే ఆశయముకోసమే మనదేశ మంతా కృషిచేస్తోంది. మనదేశములో ప్రతివాని పరమాశయమూ ధనికుడు కావటమే. ప్రతివానికీ ప్రతి యితరుడూ యేదో చిన్న మెత్తు బంగారము సాధించుటనే సాధనము మాత్రమే. మానవ రక్త మాంసాలనుండి బంగారాన్ని సాధించడమే అసలు జీవితసారం. ఈదేశప్రజలేమి—యితరదేశాల ప్రజలేమి— అసలన్ని దేశాల ప్రజలూ కూడా పచ్చధాతువును పరిశుభ్రంచేసి వెలికితియ్యటానికి పనికివచ్చే ముడిసరుకన్న మాట. మానవుల భౌతిక శక్తిసామర్థ్యాలను అంటే రక్తమాంసాదులను కూడగట్టి బంగారముగా ఘనీభవింప చెయ్యడమే అభ్యుదయము. చూడండి, జీవిత మెంత సులభముగా యేర్పాటుచెయ్యబడిందో...."

"ఇది మీస్వంత అభిప్రాయమేనా?" అని ప్రశ్నించాను.

"అదా? అబ్బే, కాదు" గర్వంగా చెప్పాడు. అదెవరో ఒక మహానుభావుని ఊహాగానము ... అది నాబుర్రలో యెలా, ఎప్పుడు ప్రవేశించిందో నాకే తెలియదు. కొద్దిగా ... అసామాన్యులతో మాట్లాడేటప్పుడు దానిని నేను ఉపయోగిస్తాంటాను. సరే, అసలు విషయం. ఇక్కడి ప్రజలకు నిర్దిష్టముగా ప్రవర్తించ టానికి సమయమేలేదు: తీరిక అంతకన్నా లేదు. మనిషి పడే కాయ కష్టము విరామ కాలములో పాపకార్యాలు చేసేందుకు బలముగాని, అసలు కోరికగాని వారిలో మిగలనంతగా వారిని పీడనపెట్టేస్తుంది.

ప్రజలకసలు ఆలోచించటానికి తీరికగాని, కోరికలు కలిగివుండటానికి శక్తిగాని లేకుండాపోయింది. వారు కాయకష్టంతో బ్రతుకుతారు, కాయకష్టము చేసేందుకే బ్రతుకుతారు. కాబట్టే వారి జీవితాలు బహునీతిమంతాలు. ఏడాదికో, ఆర్నెల్లకో ఒకమారు యేనెలవురోజునో ఒకరిద్దరు నిగ్గర్లను (నీగ్రోలకు నీచపదం) కట్టి చిత్రహింసలు పెడుతూవుంటారు. అన్నంత మాత్రాన వారు అవినీతికి పాల్పడ్డారనుకోటానికి వీల్లేదు. కారణం స్పష్టమే. నిగ్గర్లంటే మరి తెల్లవాళ్ళు కాదుగా? అంతేకాదు, ఎక్కడ చూసినా యీ చెత్తాకానీ నిగ్గర్లే. ప్రతివాడూ గౌరవంగా ప్రవర్తించాలని ప్రయత్నించే యీ ప్రపంచంలో, యీ పురాతన ఆచార సాంప్రదాయాలమధ్య ఆ సూత్రాలకు ఏమాత్రం భంగం కలిగినా అదొక పెద్ద మహా దోషంగా కనిపిస్తూ వుంటుంది. అది కొంతవరకు మంచిదే అయినా, కొంత చెడ్డదికూడాను. సమాజంలోని ఉన్నత వర్గంవారు క్రిందివర్గాలవారి ప్రవర్తనసుచూసి గర్వించవచ్చు. కానైతే, అట్టి ప్రవర్తనే తాము కలిగివుండాలంటే ధనికులపని ఘేషస్లకు రేషస్లు పెట్టుకున్నట్టుగా వుంటుంది. వాళ్ళు ధనవంతులు —అంటే నీతి నియమాల విషయం అట్టే పట్టించుకోకుండా వాళ్ళయిష్టం వచ్చినట్లు ప్రవర్తించవచ్చు నన్నమాట. ధనవంతులు దురాశాపరులు, తిండిపోతులు, కామాతురులు, భోగలాలసులు అయ్యుంటారు. సారవంతమైన నేలమీద మొక్కలెంత ఏపుగా యెదుగుతాయో, విషయలోలుత్వమనే నేలమీద పోకిరీతనం అంత బలంగా పెరుగుతుంది. అప్పుడింక జరగాల్సిందేమిటి? నీతి నియమాలను వదలివెయ్యటమా? అలా వదిలివెయ్యటం మూర్ఖం—కనుక అసంభవం. ప్రజలు నీతిమంతులుగా వుండటం

నీ ప్రయోజనాలను అవసరమైననాడు గప్‌చిప్‌గా నీ పాపాలను వారి ఎనుమరుసుచెయ్యి.... అంతే. ఇందులో పెద్ద విశేషంగాని, వింతగాని ఏముంది? ..."

అతను నటు తొంగిచూసి మరింత మెల్లిగా చెప్పసాగాడు:

"అంచేత మూశాయా, న్యూయార్కులోని కొందరు పెద్దమనుష్యు లొకచోట జేరి ఒక గొప్ప ఆలోచనచేశారు. నీతి సూత్రాలను బహిరంగంగా ఉల్లంఘించే సభ్యులతోకూడిన ఒక రహస్య సంఘాన్ని స్థాపించడమే ఆ ఆలోచన. ఒక గొప్పవిధిని ప్రోగుచేసి యీదేశంలోని వివిధపట్నాలలో ప్రజాభిప్రాయాన్ని వియూధమొనర్చే సమితులను— రహస్యంగానే అనుకోండి— స్థాపించారు. మీఎదుటనున్న యీ సామాన్యునివంటి అనేకమందిని జీతాలకు కుదుర్చుకుని, వారిచేత నీతిసూత్రాలను ఉల్లఘింప చేస్తున్నారు. ప్రతి సమితికీ నమ్మకస్తుడూ, అనుభవశాలీ అయిన ఒక పెద్దమనిషి నాయకుడుగా వ్యవహరిస్తూ వుంటాడు. ఆయనే పనులు పురమాయించటం మొదలైన సమితి కార్యకలాపాలన్నింటినీ నడుపుతూంటాడు ..సర్వసాధారణంగా యిట్టి సమితినాయకు లందరూ పత్రికా సంపాదకులై యుంటారు...."

"ఈసమితి ఆదర్శమే నాకు బోధపడకుండావుంది!" విచారంగా ప్రశ్నించాను.

"అదిచాలా సులభమే!" అతను జవాబిచ్చాడు. అకస్మాత్తుగా అతని ముఖభంగిమ మారిపోయింది. ఖంగారు, బెదురు కానవచ్చాయి. అతను లేచి చేతులు వెనక్కిపెట్టుకుని గదిలో పచారుచేయసాగాడు.

"చాలా సులభమే" అతను తిరిగి ప్రారంభించాడు .... అలగాజనం పాపకార్యాలకు అంతగా ఒడిగట్టరని ముందే చెప్పానుగా? అస లందుకు వాళ్లకు తీరికేపుండదు. కాని, నీతి నియమోల్లంఘనం చేయకతప్పదు!—నీతినియమాలను గురించి ప్రజల చెవుల్లో మోతపెట్టించిననాడుగాని సత్యాన్ని వారు గుర్తించకుండా చేయడం సాధ్యంకాదుకదా. పది చిన్నతప్పుల్లో ఒక పెద్దతప్పు కప్పుబడిపోతుంది. ప్రక్కవాడిజేబులో పర్సు కొట్టేశావనుకో, వెంటనే నువ్వు చెయ్యవలసిన పనేమిటి? సెనగలు దొంగిలించిన కుర్రాణ్ణి చూపించి, గొంతునింపుకుని 'దొంగ! దొంగ!' అని అరవటమే! చుట్టూవున్నవాళ్ల దృష్టి ఆకుర్రాడిమీద పడుతుంది. దానితో నీ పరువు దక్కుతుంది. అంతేకదా? అందేతనే మా సమితి ఘోరనేరాలను కప్పిపుచ్చటానికిగాను చిల్లరమల్లర గలాటాలు రేపుతూంటుంది."

అతను నిట్టూర్చి, గదిమధ్య నిలబడి ఒకింతసేపు మౌనం దాల్చాడు.

"ఉదాహరణకి, పట్నంలో ఒకానొక పెద్దమనిషి తన భార్యను పశువును బాదినట్లు బాగాడనే పుకారు బయల్దేరిందనుకోండి. సమితి వెంటనే పూనుకుని నన్నూ, మరికొందరు సభ్యులనూ మా మా భార్యలను బాదమని ఆదేశిస్తుంది. మా భార్యలకూ యిదంతా నాటకమని తెలుసు. కనుక వాళ్లంతా గొంతులు చించుకుని శక్తికొద్దీ అరుస్తారు. అంతగొడవ జరిగాక గోరంతలు కొండంతలుచేసే పత్రికలవాళ్లు ఊరుకుంటారా? కథల్లి చిలవలూ పలవలూ చేర్చి తాటికాయలంతేసి అక్షరాలతో యీవిషయాలు

ప్రచురిస్తారు. అది చదివిన ప్రజల్లో కలకలం బయల్దేరుతుంది. ఈ కోలాహలంలో పట్నంలోని పెద్దమనిషి తన భార్యను చావ బాదిన విషయం మరుగుపడిపోతుంది. ఇక్కడ ప్రత్యక్షంగానే ఎదుట యథార్థవిషయాలు కనిపిస్తాంటే పుకార్లతోలి ఎవరికి కావాలి? సెనేటర్లు లంచాలు తినేవిషయం పైకి పొక్కిందనుకో. వెంటనే పదిమంది పోలీసు అధికారులు లంచాలుపుచ్చుకున్న సందర్భాలను వెలికిలాగి ప్రజలముందు వారి లంచగొండితనాన్ని ఋజువుపరుస్తారు. అంతే మళ్లీ యథార్థవిషయాలు పుకార్లను ముంచివేస్తాయి. ఉన్నత సమాజంలో ఏవ్యక్తియైనా ఒకస్త్రీని అవమాన పర్చాడనుకోండి. వెంటనే హోటళ్లలోను, వీథుల్లోను వంద మంది స్త్రీలు అవమానింపబడే యేర్పాట్లుజరుగుతాయి. సమాజంలో చెలామణవుతూ తిరిగే పెద్దమనిషి తప్పిదం అటువంటి తప్పిదాల మాటున మరుగైపోతుంది. ఏవిషయం చూసినా యిదే తంతు. పెద్ద బండపోయి చిల్లరమల్లర దొంగతనాల సందడిలో మరుగు పడిపోతుంది. సమితిచేసే పనే అది."

కిటికీలోనుండి జాగ్రత్తగా బయటకు తొంగిచూసి, తిరిగి అదే మంద్రస్వరంలో ప్రారంభించాడు:

"సమితి యీవిధంగా అమెరికన్ సమాజంలోని ఉన్నత వర్గపు అవినీతిని అనేక యితర చిన్న నీతిబాహ్య కార్యాలమాటున మరుగుపరచి వారిని ప్రజాభిప్రాయంనుంచి కాపాడుతుంది. ప్రజ అనేకవిధమైన సంతతసౌఖ్యాలలో పున్నారు. పత్రికల్లో పడివి, ఉన్నవి వున్నట్లుగా విశ్వసించడమే గాని, స్వయంగా ఆలోచించటం ప్రజలు మానుకుని చాలాకాలమైంది. పత్రికలన్నీ

లక్షాధికారులవి; మా సమితి స్థాపకులు కూడ వారే .... అర్థమైందా అసలు విషయం? గొప్ప ఆలోచనకాదూ...."

అతను తలవంచి ఆలోచించసాగాడు.

"[illegible]" అన్నాను. "నువ్వు చెప్పిందంతా చాలా పసందుగావుంది."

అతను తలెత్తి విచారంగా నావంక చూశాడు.

"అ— వుననుకో. పసందుగా వుండేమాట నిజమేననుకో" అతను మెల్లగా ఆలోచనాపూర్వకంగా చెప్పాడు. "కాని నాకిదంతా విసుగెత్తిపోయింది. నాకు మూస్తే పెళ్లాం బిడ్డలున్నారు. స్వంత యిల్లూ వాకిలీ వున్నాయి .. రాత్రి విశ్రాంతి అన్నది యెప్పుడు చిక్కుతుందా, యెప్పుడు సుఖంగా, నిశ్చింతగా వుందామా అని వుంది నాకు—ఇదుగో, నా ఉద్యోగముంది చూశావూ, దాని దుంప తెగ! నా ప్రాణాలు తీస్తోందనుకో. నమ్మి నమ్మకపో నైతిక సూత్రాలపట్ల గౌరవం ప్రకటించటమన్న పని తేలిక కాదనుకో. లిక్కరంటే నాకు పరమాసహ్యం: కాని ఉద్యోగరీత్యా త్రాగి తీరాల్సిందే: పచ్చి తీరాల్సిందే: ఇంకొక విషయం, నా భార్యపట్ల నాకు అమితమైన ప్రేమ. శాంతియుతమైన సాంసారిక జీవితమంటే నాకు చాలయిష్టం. అయితేనేం, హోటళ్లలో ఆడవాళ్ల వెంట రాసుకు పూసుకు తిరిగి గంటాటాలు చేపట్టియ్యవలసిందేకదా.... ప్రతిరోజూ నన్ను గురించి పత్రికల్లో యేదో ఒకవార్త వెలువడుతూ వుండాల్సిందే కదా ..మారుపేరనే అనుకో: అయితేమాత్రం ..ఏదో ఒకనాడు నా అసలుపేరు బయటపడకుండా వుంటుందా? అప్పుడు ... అప్పుడింక యీపట్నంనుంచి బిచాణా యెత్తెయ్యాల్సిందే ...ఈ

సందర్భంలోనే సలహా తీసుకోవాలనుకుంటున్నాను. నీసద్దకు ఒకా నొక క్లిష్టవిషయంలో సలహా తీసుకోవాలనే అస లిటువచ్చాను!"

"ఏమిటా విషయం?" అని ప్రశ్నించాను.

"చూశావూ" అతను ప్రారంభించాడు—"యిదీ అసలు సంగతి. ఈమధ్య దక్షిణరాష్ట్రాల్లోని కులీనులు చాలామంది నీగ్రో ఉంపుడుకత్తెలను ఉంచుకుంటున్నారు .... ఒకేసారి యిద్దరు ముగ్గుర్ని! ఈవిషయం ప్రజల్లో పాకింది. వారి భార్యల కీవిషయం సరిపడక భయుత్తమ భర్తల చేష్టలను బట్టబయలుచేస్తూ పత్రికలకు లేఖలు రాయడం కూడ తటస్థించింది. దానితో పెద్ద గలభాచేసే టట్లుంది. వెంటనే యీవిషయంలో మాసమితి పూనుకొని (మా పరిభాషలో) 'ప్రతిసత్యాలను' సృష్టించనారంభించింది. సమితిచేత నీగ్రో ఉంపుడుకత్తెలను పెట్టుకొనేందుకై నియోగింపబడ్డ పది ముగ్గురు ఏజెంట్లలో నే నొకడిని. ఒకేమారు యిద్దరుముగ్గుర్ని!...."

బెదురుతూ క్రిందకురికి, కోటుజేబులో చేతులు దోపి చెప్పాడు:

"ఆపని నేను చస్తే చెయ్యలేను! నా భార్యంటే నాకు చాలా ప్రేమ ...అయినా ఆమె దీని కంగీకరించదు! పోనీ ఒక్కతెనైతే అనుకోవచ్చు!"

"పోనీ మానెయ్యరాదూ?" అని సూచించాను.

అతను నావంక జాలిగా చూశాడు.

"మానుకుంటా సరే, మరి అప్పు డింక వారానికి నాకు యాభై డాలర్లిచ్చే నాథుడెవడు? అంతా సరిగా నెరవేరినట్లయితే బోనస్‌కూడా ముడుతుందికదా? అబ్బెబ్బే! నువ్విచ్చే సలహా యిదే

అయితే, యీ కలహాకాస్త్రా నీదగ్గరనేవుంచుకోవచ్చు. డబ్బిచ్చేవాడుంటే ఏ అమెరికనూ, ఆఖరికి చచ్చిపోయిన మనుషైనాసరే అనడు. ఇం కేమన్నా ఆలోచించవయ్యా"

"కష్టమే" అన్నాను.

"కష్టమా ? మీకూ కూడా కష్టమే ? మీ యూరోపియన్లెవ్వరూ నైతిక విషయాల్లో అంత పట్టింపులు పెట్టుకోరని విన్నానే....అసలు మీ విషయ కౌశల్యాన్ని సామెతగా చెప్పుకుంటారే."

తాను చెప్పింది పరమ సత్యమన్న దృఢ నమ్మకంతో అత డీమాట అన్నాడు.

"పోనీ" నా వైపుకు వంగి అతను కొనసాగించాడు. "నీ కెవరూ యూరపియను స్నేహితులు లేరూ ? బహూశా వున్నా రనుకుంటా ?"

"వాళ్ళతో పని ?" అని ప్రశ్నించాను.

"వా ళ్ళెందుకంటావా ?" ఒక అడుగు వెనక్కు వేసి చెప్పసాగాడు. "చూశావ్, యీ నీగ్రో స్త్రీలకి సంబంధించిన పని నేను చెయ్యలేనంతే, పోనీ నువ్వే ఆలోచించు : నా భార్య చూస్తే అంగీకరించదు; ఆమె అంటే నాకు ప్రేమ. అట్టే నేనా పని బొత్తిగా చెయ్యలేను ..."

అతను తన తల నష్టంగా ఊపి, బట్టతల తడుముకుంటూ నా సానుభూతి సహాయాల నపేక్షిస్తూ కొనసాగించాడు :

"నీకు పరిచితుడైన యూరపియను నెవ్వరినైనా యీ పనికి కుదిర్చి పెట్టలేవూ ? యూరపియన్లు నైతిక విషయాల నొట్టే

పట్టించుకోకు ఏనుక వాళ్ళ కాస్తో యిబ్బందిపేదు. ఏ శరణార్థినో చూసిపెడుదూ. ఆఁ? అతనికి వారానికి పది ఁ లిస్తాను, ఏమంటావ్, బాగా వుంటవూ? సీగ్రో స్త్రీలతో తిరుగుతా ననుకో....నిజానికి. అన్ని తంటాలూ నేనే పడతాను. బిడ్డల్ని కలిగించే బాధ్యత మాత్రమే అతనిది....ఈ రాత్రే యీ సంగతి తేలిపోవాలి. చూడు మరి. యీ దక్షిణరాష్ట్రపు గల్లంతును కల్పిత గలభాలతో సమాలంలో ముంచి వెయ్యకపోతే యెంత ఉపద్రవం చెలరేగుతుందో? నీతి నియమూఉ నిలబడాలంటే, వెన్వెంటనే యీపని జరగాలి.. "

...అరిచి గది పిడిచిపోనారే అని ముద్రకు తగిలి గాయపడిన నా చేతిని చల్లబడనానికిగాను కిటికీ అద్దానికి చేర్చపుంచాను.

అతను వీధిలో నిలబడి నాంజ్జలు చేస్తున్నాడు.

"ఏంకావాలి?" కిటికీ తెరచి ప్రశ్నించాను.

"నా టోపీ గదిలో మరచిపోయాను" వినయంగా అన్నాడతను.

చెర్బీ టోపీ తీసి వీధిలోకి విసిరేసి కిటికీ మూసేస్తూవగా "వారానికి పదిహేను డాలర్లయితేనో? సరిపోతుందనుకుంటానేను!" అన్న అతని బేరం నా చెవినిపడింది.

